నవంబర్ 10 విడుదల

సాంఘికాచారాలకు
జీవితసత్యాలకూ మధ్య
సంఘర్షణ





# కుంకుమ రేఖ



దర్శకత్వం
తాపీ చాణక్య




నవయుగ

PRASAD

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

## ఉత్తరాలు

### మనమూ—మన దేహస్థితీ

మీరు ఆంధ్రసచిత్ర వారపత్రికలో వరుసగా ప్రచురిస్తున్న "మనమూ - మన దేహస్థితీ" అను శీర్షిక చాలా ఆనందాన్ని కలుగచేసింది. పత్రిక పాఠకలోకానికి కబుర్లు కథలే కాకుండా విజ్ఞాన విశేషాలనుకూడా అందించే మీ పత్రికకు నా ధన్యవాదాలు. మీరు వ్యాసంతోపాటు ఈ వారం ప్రకటించిన జీర్ణకోశం బొమ్మకూడా వ్యాసానికి ఒక చక్కని అందం చేకూర్చింది. అల్లే స్ప్లీను, లివరు, హార్టు, వగైరాలుకూడా ప్రచురిస్తూ వానిని గ్లేజు పేపరుమీద ముద్రించి వారానికొకటి పత్రికకు జతచేసి పంపిన చాలా బాగుండునని నా అభిప్రాయము.

డా॥ ఏం. రమేశ్ (కారెంపూడి)

* * *

### హిందీభాషావాదుల ఉద్యమం

దీపావళి సంచికలో న్యూఢిల్లీ లేఖను విమర్శించుతూ వరంగల్ నుండి శ్రీ పి. గోపిరెడ్డి గారు వ్రాసిన ఉత్తరంలో "ఇంగ్లీషుభాషను ధ్వంసం చెయ్యటానికి ఇదివరకే అద్దమైన ప్రయత్నాలు జరిగాయి...నిజానికి రాష్ట్రపతి హిందీభాషావర్గంవారి అగ్రనాయకుడు" అన్నది వివక్షణారహితమైన విమర్శగా పేర్కొన్నారు. ఇది రెడ్డిగారి హిందీభాషాభిమానాన్ని చూచిస్తున్నదే గాని శ్రీకృష్ణగారి విమర్శను ఏమాత్రం కించపరచటంలేదు. ఇంగ్లీషును ధ్వంసం చెయ్యడానికి జరుగుతున్న ప్రయత్నాల మాట అబద్ధమా? రాష్ట్రపతి హిందీభాషావర్గంవారికి నాయకత్వం వహిస్తున్న మాట అబద్ధమా? రెండూ రెండు నగ్న సత్యాలై నప్పుడు, శ్రీకృష్ణగారి విమర్శలో విచక్షణారహిత మేమున్నది? ఒకపక్క హిందీని దాక్షిణాత్యులమీద బలవంతంగా రుద్దుతూనే "మేము మీ మీద హిందీని రుద్దటంలేదు. అందుకని మీరు మీ మీద ఇంగ్లీషు రుద్దవద్దు" అని రాష్ట్రపతి మొ॥ దాసులలో విసిరిన విసుర్లు కూడా హిందీభాషావర్గంవారికి ఆయన అగ్రనాయకుడన్న విషయాన్ని మరోసారి రుజువు చేస్తున్నాయి.

ఒకసారి ఆంధ్రపత్రిక అన్నట్లుగా, మన ప్రభుత్వం హిందీభాషాభివృద్ధికి ఖర్చు

చేస్తున్న సొమ్మును ప్రాంతీయ భాషలమీద వినియోగించినట్లయితే, ఈ పాటికి అవి ఎంతగానో అభివృద్ధి చెందిఉండేవి. దురభిమానులైన హిందీ భాషావాదులతో పోటీపడి ఇతరప్రాంతీయుల నేతలు హిందీతో సమానంగా తమ తమ ప్రాంతీయభాషలను అభివృద్ధి చేసుకోవాలనే ఆవేశంలో విశ్వవిద్యాలయస్థాయిలో ఇంగ్లీషును త్రోసిరాజని ప్రాంతీయభాషలలో విద్యాబోధన జరిగే ఏర్పాట్లు చేస్తున్నారు. దీనిమూలంగా అసలే దిగజారిపోయిన మన విద్యాప్రమాణాలు ఇంకా పతనమై పోతాయన్న విషయాన్ని విస్మరిస్తున్నారు. "పోగాలము దాపురించినవారు మిత్రవాక్యమును, అరుంధతిని, దీపనిర్వాణ గంధమును, వినరు, కనరు మూర్కొనరు."

కొడాలి సుబ్బారావు (కలకత్తా)

* * *

## కార్టూనులు

ప్రఖ్యాత వ్యంగ్యచిత్రకారుడు శ్రీ ఊమెన్ గారి కార్టూన్లు చాల బాగుగా ఉన్నవి. 26-10-60 పత్రికలో పొదుపు ఉద్యమంగురించి పడిన కార్టూను చాల బాగుంది.

శ్రీ శంకర్ గారి ఎప్పుడూ ఇంతే వనితాలోకంనుంచి తీసి మరెక్కడయినా వేయవలెను.

కుమారి రంగనాయకి (నర్సాపురం)

* * *

2-11-60 వ తేది ఆంధ్ర సచిత్ర వారపత్రికలో "ఉరి సులువుగా తీయబడును" అను కార్టూన్ చాల బాగున్నది. నిజం చెప్పాలంటే ఈ కార్టూన్ బహుమతి పొందవలసింది.

జిడిముళ్ళ రంగయ్య (రెడ్డిపాలెం)

* * *

## చిత్ర సమీక్షలు

సున్నితమైన హాస్యంతో, నిష్పక్షపాతంగా చిత్రసమీక్షలను వెలువరించడంలో ఆంధ్రపత్రికదే అగ్రతాంబూలం. అయితే, ఈ సమీక్షలు తెలుగు చిత్రాలవీ, అప్పుడప్పుడు ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ చిత్రాలవీ అయి ఉంటున్నాయి.

కానీ, అరవ చిత్రాలలో ఒక్కదాని గురించేనా ఎప్పుడూ సమీక్షించడం జరుగలేదు. భాగప్పిరివినై, పడికొథ మేధై, మీందసొర్గం వంటి ఉత్తమ చిత్రాలు వస్తున్నాయి అరవంలో. అందుచేత అప్పుడప్పుడైనా అరవచిత్రాల సమీక్షలు కూడా ప్రచురిస్తే బాగుంటుందని నేనంటే, మీ రేకీభవిస్తారని ఆశిస్తున్నాను.

ముకొక్కసి (విశాఖపట్టణం)

## ఎప్పుడూ ఇంతే

ఎప్పుడూ ఇంతే శీర్షిక మొదట్లో చాలా బాగుండేది. ఇప్పుడు రానురాను కోటేషన్సు పాడయిపోతున్నాయి. అధమం రెండు



# ఉత్తరాలు

వ్యాఖ్యలు వేస్తే బాగుంటుందేమోనని నా ఉద్దేశం.

డి. ఎల్. ఎస్. శాస్త్రి (కాకినాడ)

* * *

## నిదురపోయే సెలయేరు

"నిదురపోయే సెలయేరు" సీరియల్ కథ చాలా బాగున్నది. రెండవ సంచికలోనే కథ ముగిసినందుకు పాఠకుల మనస్సు నొచ్చుకొనక మానదు. సమాజంలో కట్టుబాట్లను ఎదిరించలేక మూగజీవులుగా కృంగి, కృశించిపోతున్న అనాయక స్త్రీల జీవితాన్ని అమోఘంగా చిత్రించిన, రచయిత "నివాద" గారు అభినందనీయులు.

ఎ. సి. హెచ్. ముని (గుంటూరు)

* * *

## ఉత్తరాల శీర్షిక

'ఉత్తరాల శీర్షిక పత్రికకు ప్రత్యేకాకర్షణ'—పాఠకుల పలురకముల అభిప్రాయాలు చదువుతుంటే, నాకు ఒక్కోసారి కథలకంటే రసవత్తరంగా అనిపిస్తోంది అంటే అతిశయోక్తి కాదనుకుంటాను.

గిరి (గొల్లప్రోలు)

* * *

## తెలుగు వెలుగులు

మీ పత్రికలోని "తెలుగు వెలుగులు" చాలా బాగుంటున్నాయి. 2-11-60 తేదీ పత్రికలో శ్రీ వేముల కూర్మయ్యగార్ని గూర్చి చాల బాగ వ్రాశారు. దయచేసి రచయిత లేక రచయిత్రి పేరు తెల్పండి.

శ్రీ స్వరాజ్యలక్ష్మి (రాజమండ్రి)

* * *

2-11-60 తేదీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో శ్రీ వేముల కూర్మయ్యగారినిగురించి తెలుగు వెలుగులలో వ్రాసినది అక్షరాలా నిజమైనా ఇంకా మీరు వ్రాయుటలో కొంత అశ్రద్ధ చేసినారేమో ననక తప్పదు. ఆయన పరప్రభుత్వములో పదవులను సంపాదించ తలచిన ఏనాడో సుప్రీంకోర్టుజడ్జి అయి కూర్చుండేవారు.

గూడవల్లి స్వాములు (కోటగిరి)

* * *

## పొట్టికథలు

ఈ వారము (2-11-1960) ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన 'పొట్టికథలు' చాలా బాగున్నవి.

వజ్జాల రామలింగము (తెనాలి)

* * *

2-11-1960 ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించిన "పొట్టి కథలు" నాకు బాగానే ఉన్నవి. పత్రిక రాగానే ఆఖరిపేజీ చూసి, కార్టూనులు, పొట్టికథలు చూస్తాను. నాకు నచ్చుతాయి. ఈ వారం పత్రికలో డి. రామనరసింగరావు (చక్రధరపూర్) వ్రాసిన పొట్టికథలు బాగా ఉన్నవి.

తీగవరపు వెంకటసుబ్రహ్మణ్య సుధాకరరావు (చింతలపూడి)

* * *

## సమాధానం

పై హెడ్డింగ్ నలుగురికి సరిపోతుంది. మొదట చదరంగాన్ని గురించి వ్రాస్తాను:

శ్రీ ఎం. ప్రభాకరరావు (వాడి) గారి అనుమానాల్ని తీరుస్తాను. భారతీయ పద్ధతిలోను, విదేశీయ పద్ధతిలోను కాయలు నడిచే విధానం ఒక్కటే. కాని భారతీయ పద్ధతిలో పావులు మొదట ఉన్న చోటనుంచి (అంటే పుట్టుగడి నుంచి) ఒక్కగడి మాత్రమే కదులుతాయి. విదేశీయ పద్ధతిలో రెండు గడులుకూడ కదులుతాయి (పుట్టుగడి నుంచి మాత్రమే).

శ్రీ బల్లా సత్యనారాయణ ప్రసాద్ (కర్నూలు) గారి సందేహాలకు సమాధానాలు:

1. భారతీయ పద్ధతిలో ఆట మొదలుపెట్టినప్పుడు ఒకేసారి మూడుఎత్తులు వెయ్యవచ్చు. కాని విదేశీయపద్ధతిలో మాత్రం ఒక్క ఎత్తు మాత్రమే వెయ్యాలి.

2. బంటును బంటు చంపకుండా ముందుకు జరుగవచ్చు. కాని ఆటలోని పరిస్థితినిబట్టి, మనకు లాభం వచ్చే విధంగా బంటును బంటుతో చంపడమో, లేక ముందుకు జరపడమో చెయ్యాలి.

3. ఏనుగుకాని, లేక రాజుగాని వాటి స్థానాలలోనుంచి ఒక్క గడిఅయినా కదలకుండా ఉంటే ఆట అయ్యేలోగా 'కాజిల్' చెయ్యవచ్చు. కాని ఇది విదేశీయపద్ధతిలో మాత్రమే. భారతీయ పద్ధతిలో "గజు" అనేలోగా రాజుకు ఒకసారి గుఱ్ఱపుఎత్తు వేసుకునే ఛాన్సు ఉంది.

4. "షా" అన్నా, "చెక్" అన్నా, లేక "రాజు" అన్నా ఒక్కటే.

సీతారామమూర్తిగారికి కూడా కొన్ని వివరాలను తెలియజేస్తాను. చదరంగం బాగా ప్రాక్టీస్ చెయ్యాలంటే ప్రతిఎత్తు బాగా ఆలోచించి ఆడాలి. తొందరపడి ఎత్తులు వెయ్యకూడదు. ప్రపంచంలోని పెద్ద పెద్ద ఆటగాళ్లు ఆడిన ఆటల ఎత్తులన్నీ ఒక పుస్తకంలో ఉన్నాయి. దాన్ని కొని, ఆ ఆటలను మీరు వేసి చూసుకొని గమనించండి. ఆ పుస్తకం పేరు "రష్యన్ స్కూల్ ఆఫ్ చెస్." దాని వెల మూడు రూపాయలు. తరచుగా బాగా ఆడేవాళ్ళతో ఆడుతూ ఉంటే మీ ఆట త్వరలోనే అభివృద్ధి చెందుతుంది.

టి. రాజశేఖర్ (విజయవాడ)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక



Founder

K. Nageswara Rao

స్థాపితము

1908



సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



సంపుటము 55

సంచిక 11

16-11-60

బుధవారం

శార్వరి కార్తిక బహుళ ద్వాదశి



విడిప్రతి వెల 25 న. పై.

సంవత్సర చందా 13-0-0



ఆంధ్రపత్రిక కార్యాలయము

7, తంబుచెట్టివీధి,

మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:

డీలక్స్ పిక్చర్స్‌వారి 'బాగ్దాద్ గజదొంగ'లో

వైజయంతిమాల



## ఆంధ్రసచిత్రవారపత్రిక నిర్వహిస్తున్న పోటీలు

'కథ కానికథ', 'కార్టూన్ పోటీ', 'గళ్ళ నుడికట్టు ఆధారాలపోటీ', 'కవితాకింకిణి' మున్నగు పోటీలలో పాల్గొనేవారు ఈ దిగువ పేర్కొన్న అంశాలుగమనించాలని కోరుతున్నాము:

ఆయాపోటీలలో పాల్గొనడానికి ప్రత్యేకమైన నిబంధనలు ఏమీలేవు. ప్రవేశరుసుము లేదు. ఎవరు అయినా పాల్గొనవచ్చు. పోస్టుకార్డులమీద వ్రాసి పంపినా, 'ఇన్‌లాండ్ లెటర్'లలోను, కవర్లలోను పంపినా ఏపోటీకి సంబంధించినది స్పష్టంగా వాటిమీద వ్రాయవలసి ఉన్నది. ఆవిధంగా వ్రాసి పంపని వాటిని పరిశీలించడం జరుగదు. అన్ని పోటీలకు కలిపి ఒకే కార్డుమీదగాని, ఇన్‌లాండ్ లెటర్‌లోగాని, కవరులో కాని పంపినా వాటిని పరిశీలించడం జరుగదు.

ఆయా పోటీలకు పంపినవాటిని తిప్పిపంపడం జరుగదు. తనుక స్టాంపులుకాని, స్టాంపులు అతికించిన చిరునామాలు కల కవర్లుకాని జతచేసి పంపరాదు.

కార్టూన్లు ఏ కాగితంమీద అయినా వేయవచ్చు. కాని 'ఇండియన్ ఇంక్'తో వేయవలసి ఉన్నది.

ఏసందర్భంలోను ఆయాపోటీలలో పాల్గొనేవారితో ఉత్తరప్రత్యుత్తరాలు జరపడం సంభవంకాదు.

—సంపాదకుడు.

మీ కడుపులో
బాధలన్నీ త్వరలోనే
సర్దుకుంటాయిలెండి!

నేనూ అలాగే
ఆశిస్తున్నాను
అయినా వెద్యులు
చెప్పేది తప్పేవుతు
ఉంటుంది మరి!

డాక్టర్
సంజీవ
రెడ్డి

కాంగ్రెసు

ఆచార్య కృపలానీ
నిష్క్రమించడంతో మా
విమానం రెక్క ఒకటి విరిగి
పోయింది.— మీరేమైనా
ఒక చెయ్యి వేస్తారా?

గోధుమలకు బియ్యానికీ యుద్ధం!

మీరు గోధుమలు తినండి — మాకు బియ్యం ఇవ్వండి

మాకు బియ్యం ఇవ్వండి

దక్షిణా ప్రాంతాల వారి మనుగడకు బియ్యం అవసరం

గోధుమలు తినండి — బియ్యం మానేయండి

వరి అన్నం తక్కువ తినండి

వరి అన్నం తక్కువ తినండి — మాకు గోధుమలు ఇష్టం

వరి అన్నం తక్కువ
తినండి
అనే ఉద్యమం
ప్రారంభించాలని నెహ్రూ
సంకల్పం.

దక్షిణాది వారు
ప్రతికూల ఉద్యమం
ప్రారంభించగలరు,
తప్పక.




నిశ్చలమైన తటాకంలోని నీటిలాటి – నిర్మలాకాశంలాటి – నిశ్చలత – నిశ్శబ్దత. ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ "టక్-టక్"మని తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూ సాగిపోతున్నది గడియారం. బోనులో సింహంలా – నిలబడి వున్నాడు కేడీ రాఘవులు. గుబురుగా పెరిగిన కనుబొమల క్రిందనించి తినేసేలా చూస్తున్నాడు—తనకేసి. తన చేతిలోని కాగితాలపై అక్షరాలు పరిగిడుతున్నాయి. ఈ అక్షరాలకీ – రాఘవులి భవిష్యత్తుకీ ఏమిటో ఆ సంబంధం? ... తనేం చెయ్యగలడు?...తన విధ్యుక్తధర్మాన్ని తను నిర్వర్తించడం తప్ప?...

తన్ని హెచ్చరిస్తోన్నట్టుగా 'ఠంగ్'మంది గడియారం. తను బుర్ర పైకెత్తడంతో కోర్టు హాలులోని నిశ్శబ్దత సడలిపోయి రొద ప్రారంభమయింది. "ఆర్డర్ ఆర్డర్" తను జడ్జిమెంటు చదవడానికుద్యుక్తుడయ్యాడు.

ప్రముఖ నగల వ్యాపారి చెల్లారాం షాపులో జరిగిన చోరీకేసు ఇది. 'నైట్ వాచరు' నారాయణని కత్తితో గాయపరచి సుమారు ఇరవై వేలు విలువగల నగలు అపహరింపబడాయి.

అనుమానంపై రాఘవులు అరెస్టు చెయ్యబడాడు. అతణ్ని ఇప్పుడు కోర్టులో నారాయణ గుర్తుపట్టేడు.

చోరీ నగలు ఖరీదు చేసిన వ్యాపారులు కూడా రాఘవుల్ని గుర్తించగలిగారు.

రాఘవులు పేరుపడిన పాతకేడీ. వాడి పేరు చెబితే పసిపిల్లలు పాలు తాగరు – పిట్టలు నీళ్లు ముట్టవు. అనేకసార్లు జైలుకి వెళ్లి – ఎప్పటి కప్పుడు పోలీసుల కళ్లల్లో నేర్పుగా కారంచల్లి దొంగతనాలూ అవీ చేస్తూంటాడు.

ఈసారి రాఘవుల్ని గట్టిగా శిక్షించడానికే తను నిశ్చయించాడు. ఇలాటి వారు సంఘానికి చీడపురుగులు (!) – రాఘవులు తనకేమీ తెలియదని బుకాయించడానికి వీలేనంత గట్టిగా సాక్ష్యాలూ; ఆధారాలూ దొరకడంతో వాడి నోటికి తాళం పడింది. పబ్లిక్ కోర్టులో – తనే ఆ దొంగతనం చేశానని – నారాయణని కత్తితో పొడిచానని; డబ్బు పూర్తిగా విచ్చలవిడిగా ఖర్చు పెట్టేశాననీ ఒప్పు

# శిక్షా స్మృతి

కున్నాడు. 'మీ ఇష్టం వచ్చినట్టు శిక్షించు కోమ'న్నాడు.... పైగా హాలు దద్దరిల్లేలా వికటాట్టహాసం చేశాడు.

రాఘవులికి తను పది సంవత్సరాలు కఠిన శిక్ష విధించేడు......

..."రిటైర్డు సెషన్స్‌జడ్జి" శ్రీనివాస్ డైరీలోంచి బుర్ర పైకెత్తి బరువుగా నిట్టూర్చాడు. అందులోని ప్రతీ అక్షరం - తనకేసి ఏకాగ్రంగా—కసిగా చూస్తున్నాయి. తను రాఘవుల్ని దారుణంగా శిక్షించాడు. ఒక వేళ భగవంతునిముందు తను ముద్దాయిగా నిలబడవలసివస్తే ఏమని సమాధానం చెపుతాడు?

బుర్ర పైకెత్తి...గోడమీద న్యాయాధికారి దుస్తుల్లో ఉన్న తన ఫొటోకేసి గోతగా చూశాడు. బీరువాల్లో గాజు తలుపుల మధ్య నించి న్యాయశాస్త్రగ్రంధాలు నగ్నంగా— పిశాచాల్లా నాట్యం చేస్తున్నాయి. శ్రీనివాస్ భయంతో కళ్లు మూసుకున్నాడు.

"రాఘవులూ!!"...వెర్రిగా కేక పెట్టాడు శ్రీనివాస్. భయంకరమైన గత స్మృతుల నించి పారిపోదామని వ్యర్థప్రయత్నాలు చేస్తున్నాడు.

శ్రీనివాస్ కాలేజీలో చదివే రోజుల్లో సౌమ్యుడైనవాడుగాను, చురుకైనవాడుగాను పేరుగడించాడు. తన చదువు-తనలోకం-తనకి వేరే పనిలేదు - దేనితోనూ సంబంధంలేదు.

ఆరోజు 'రాఘవరావు' అనే కుర్రాడు కొత్తగా 'హాస్టల్'కి వచ్చాడు- తన ప్రాణస్నేహితుడు రాజు వచ్చి,

"ఒరేయ్ శీనూ! ఆ రాఘవరావుకి కాస్త చేవాటితనం వుంది. జాగ్రత్తగా వుండరా!" అని హెచ్చరించాడు. 'ఫర్వాలేదులే' అన్నట్టు నవ్వేడు శ్రీనివాస్.

నవ్విన నాలుగురోజులేనా తిరగలేదు. తనజేబులోని ఐదు రూపాయలు పోయాయి. —ప్రతిమూడ్రోజులికి నాల్రోజులికీ ఎవరో ఒకరు-ఏదో ఒకటి పోయిందనేగొడవ.

ఆఖరికి అందరూ కలిసి రాఘవరావుని నిలదీశారు. "ససేమిరా నేనే మీ ఎరగన"న్నాడు. నయాన్ని భయాన్ని చెప్పిచూశారు-

"ఊహు"- ఒప్పుకుంటేగా !? ఆఖరికి రాజే.

"ఒరే! హాస్టల్లోంచి ఎవ్వరూ కదలకండిరా!- తలుపులేసేసి, అందరిపెట్టెలూ సోదాచేద్దాం"- అన్నాడు. పెట్టెలన్నీ సోదా మొదలెట్టారు. శ్రీనివాస్ అందరికంటే ముందే- అందరిముందు- తన పెట్టె బోర్లించేశాడు. వరస ప్రకారం రాఘవరావు పెట్టెని కూడా తియ్యమన్నారు "తన ఆత్మగౌరవానికి భంగం—తెరవన"న్నాడు. ఎన్నో దబాయించాడు. కాని బలవంతంగా పెట్టె తెరిచేసరికి బండారం బయటపడింది. రాజుగాడి పార్కరు పెన్ను—గోపాలరావు టార్చిలైటు" సుమారు పాతిక రూపాయిలు రొఖ్ఖం బైటపడ్డాయి.

రాజుగాడి ఉద్రేకం కట్టలు తెంచుకుంది. "ఒరేయ్! రాఘవరావ్!!" పళ్లు పటపటాడిస్తూ చెయ్యి పైకెత్తాడు- వెంటనే శ్రీనివాస్ రాజు చెయ్యి పట్టుకున్నాడు.

ఆరోజునించీ హాస్టల్లో అందరూ రాఘవరావుని ఒక పురుగుకంటె నీచంగా చూడసాగేరు. హాస్టల్లో తరచు వస్తువులు పోతూనే ఉన్నాయి.

ఆనాడాదివారం. ఫోర్తియర్ చదువుతోన్న విశ్వనాధం "నా రిసువాచీ పోయిందం"టూ గంతులు వేస్తున్నాడు. సుమారు రెండువందల రూపాయిల విలువగల వాచీ—స్నానానికెడుతూ టేబిల్ మీద పెట్టాడట!- తిరిగివచ్చి చూసుకుంటే కనపడటంలేదు.

అప్పటిదాకా వరండాలో పచార్లు చేస్తున్న రాఘవరావు "రాఘవరావు ఎక్కడవున్నాడో చూడండ్రా!" అనేసరికి మాయమయ్యాడు.

"ఒరేయ్! ఇలా ఎంతకాలంరా సహించి ఊరుకునేది? ఈ విషయం ప్రిన్సిపాల్ దృష్టిలో పెట్టవలసిందే!" అన్నాడు రాజు.

విశ్వనాధం-రాజు కూర్చుని ఒక రిపోర్టు తయారుచేసి-దానిమీద హాస్టల్లో కుర్రాళ్లందర్నీ సంతకాలు చెయ్యమన్నారు.

శ్రీనివాస్ సంతకం చేస్తూ "ఎందుకురా! లేనిపోని రభస! వాణ్ణి మళ్లీ నాలుగు చివాట్లు వేసి - ఆ వస్తువేదో లాక్కుంటే పోదూ!" అన్నాడు.

రాఘవరావుని ప్రిన్సిపాల్ ముందు నిలబెట్టారు. మామూలుధోరణిలోనే నాకేమీ తెలియదన్నాడు. ప్రిన్సిపాల్ పోలీసులకి హేండోవర్ చేస్తానని బెదిరించడంతోటే- ఆ వాచీనితనే తీసి అమ్మేసినట్టు ఒప్పుకున్నాడు....ఫలితంగా 'చెడు ప్రవర్తన'కి రెండేళ్లు కాలేజీనించి 'డిబార్' చెయ్యబడ్డాడు రాఘవరావు.

ఈలోగా చదువులు పూర్తయి "ఎవరికి—వారే యమునాతీరే"...ఎవరి జీవితపథాల్లో వారు ప్రయాణాలు ప్రారంభించారు......రాఘవరావు జాడ మళ్లీ తెలియలేదు....శ్రీనివాస్ వాచీ చూసుకున్నాడు. వాచీలో స్పందనంలేదు. ఆనాడు నిర్దోషి రాఘవరావు కాలేజీనుంచి బహిష్కరింపబడుతోంటే ఈ వాచీలాగే తనూ మూగగా నిలబడ్డాడు. తను అప్పుడు ఒక్కసారి పెదవి కదిపిఉంటే...ఒక నిర్దోషిని...కాదు...తనకి నేరసునిగా సంఘం ఒక ముద్ర వేసి ఉండేది. తన జీవితగతే మారి ఉండేది. శ్రీనివాస చేతినున్న గడియారంతో టేబిల్ మీద బలంగా గుద్దేడు. గడియారం వెయ్యిముక్కలై-చిందరవందరై-వికటంగా వేనోళ్ల హసిస్తోంది. మణికట్టుమీది నూయని మచ్చపై రక్తం చిమ్ముతోంది.

...ఒక నిండుజీవితాన్ని తన స్వార్థానికి కోతవేశాడు?...అబ్బా!!-తన జీవితంలో తను మహాఘోరాలు చేశాడు. ఎంతో ధనం - ప్రఖ్యాతి గడించేడు.—తనకు మిగిలిందల్లా ఈ భయంకరమైన స్మృతులు - చిత్తక్షోభ మాత్రమే. తను జీవితంలో సాధించింది ఇంతేనా?.. తను నిర్మించుకున్న ఆ భవంతి-కరెన్సీనోట్ల కట్టలు-విలువైన వస్తువాహనాలు—ఈనాడు తన పాపాలకి ప్రత్యక్షసాక్షా చిత్రాలై తన కళ్లముందు—తాండవిస్తున్నాయి. అబ్బా!!!...ఈ స్మృతుల బారినుండి తను పారిపోగలిగితే ఎంత బాగుండును"

"హ్హా! హ్హా!! హ్హా!!! హ్హా!" కేడీ రాఘవులు ఆనాడు చేసిన వికటాట్టహాసం ...ఒకవైపూ

"ఒరేయ్!...చిన్ననాటి మిత్రుడివి. కష్టంలో ఉన్నాను. నన్ను నీటముంచినా పాలముంచినా నీదే భారం!"...తిరిగే అశ్రువులతో జాలిగొలిపేలా—ప్రాధేయపూర్వకంగా చూసే వైస్‌ఛైర్మన్ రాజు. వేరొకవైపు...గట్టిగా కళ్లు మూసుకుని రెండు చేతులతోనూ చెవులు మూసుకున్నాడు శ్రీనివాస్......

అవును! తను ప్రాణమిత్రుడి మాన ప్రాణాల్ని రక్షించేడు. తను ఆదుకోకపోతే రాజు (ఇప్పుడు ఆ పట్టణానికి వైస్‌ఛైర్మన్) బ్రతుకు బజారు కెక్కేది—రాజుకొడుకు 'రఘు' చెడు సావాసాలకి—విలాసాలకి లోనై రాజు పరువు ప్రతిష్ఠల్ని మంట కలిపేస్తున్నాడు. "చందనమల్" నగల

---

ఉపాధ్యాయుడు — ఓరేయి రాముా, 16 వ శతాబ్దం చరిత్రకారులు గురించి నీకేమైనా తెలుసునా?

రాము - తెలియకేమి, తెలురండి.

ఉపా - ఏమి తెలుసునో చెప్పు.

రాము - వారందరు కూడా చచ్చి పోయారండి.

—సింగం పురుషోత్తం (నల్లగొండ)

---

దుకాణం చోరీలో రఘు అరెస్టు చెయ్యబడ్డాడు. తగిన ఆధారాలూ సాక్ష్యాలూ బలంగా ఉన్నాయి. నైటువాచరు నారాయణతో ముఖాముఖి తలపడి అతణ్ణి గాయపరిచాడు. ఇరవై వేలనగలు దొంగిలించాడు. కొన్నినగలు అప్పటికప్పుడే అమ్మేశాడు. ఖరీదు చేసిన వ్యాపారి కూడా 'రఘు'ని గుర్తించేరు. రాజు శ్రీనివాస్‌ని ప్రాధేయపడ్డాడు. శ్రీనివాస్ తన హోదాని పలుకుబడినీ - రాజు ధనాన్ని వెచ్చించి - కేసు స్వభావ స్వరూపాలు పూర్తిగా మార్చేశాడు. డబ్బు నుంచి నీళ్ళలా ఖర్చుచేసి వీలైనంతమందిని కొనేశారు. ఈకేసు పాతకేడీ రాఘవులిపై మోపబడింది. వడ్డించేవాడు తనే కాబట్టి - మళ్ళీ త్వరలో రాఘవులు వచ్చి తన్ని బయటపెట్టకుండా పదేళ్లు కఠినంగా శిక్షించాడు...

న్యాయరక్షకులు - న్యాయభక్షకులైతే 'కంచే చేను మేస్తే'-కథ కంచికి రాఘవులు జైలుకి వెళ్ళడంలో ఆశ్చర్యమేముంది?

తను చెయ్యని నేరానికి కాలేజీలోంచి బహిష్కృతుడయ్యాడు రాఘవరావు - ఎవరో చేసిన నేరాన్ని నెత్తినరుద్ది శిక్షించాడు రాఘవుల్ని తను. రాఘవరావు ఒకవైపు రాఘవులు ఒకవైపు నిలబడి వికృతంగానవ్వుతున్నారు.

'ఆఁ...రాఘవులే-రాఘవరావా!!'—

"అవును! నా జీవితాన్ని నాశనం చేశావు దీనికి నీ సమాధానం ఏమిటి శ్రీనివాస్ ??"

ఏమిసమాధానమిస్తాడు? తను. రాఘవరావు జీవితంలో పెట్టుకున్న ఆశలి, ఆశయాల్ని సమూలసమాధి చేసిన తను ఏమిసమాధానమిస్తాడు?—అవును! అతన్ని తను ఏ నేరానికి శిక్షించాడు?? చేసిన నేరాలకా? లేక తెలివి తక్కువగా నేరాలుచేసి పట్టుబడి నేరస్థుడని సంఘంచే నిరసించబడినందుకా?

ప్రజల విశ్వాసాన్ని - ప్రజలిచ్చిన హోదాని - వారి ధనాన్ని దుర్వినియోగం చేస్తూ లక్షలార్జించిన రాజుని ఏ చట్టం శిక్షించదు! శిక్షించలేదు!! కారణం?...వాడు రాఘవరావు కంటే తెలివైనవాడు.

ఉన్నత న్యాయాధికారిగా తను అన్యాయాన్ని సమర్థిస్తో నిర్దోషుల్ని ఉరికంబాలెక్కించి జేబులు నింపుకున్నా - బంధుమిత్రపక్షపాతంతో వ్యవహరించి నిర్దోషులజీవితాలతో చెలగాటాలాడినా—తనలాంటి పచ్చిస్వార్థపరులకి 'శిక్షాస్మృతి' ఏ శిక్షా విధించలేదు. కారణం? తను తెలివైనవాడు. "శ్రీనివాస్! నీకు శిక్ష లేదూ...?...ఈ ఆత్మక్షోభ...ఈ భయంకరమైన ఈ గత స్మృతులు...ఈ స్మృతులే నీకు శిక్ష... ఇంతకంటే వేరే శిక్షేముంది శ్రీనివాస్ - అహ్హా! హా! హ్హా...!"

భయోద్వేగంతో శ్రీనివాస్ నిలువెల్లా వణికిపోతున్నాడు. నిమిషనిమిషానికి మానసికంగా క్రుంగి కృశించిపోతున్నాడు. "ఒక్కసారి - తన కపాలం పగిలి ఈ ఆలోచనలు ఒక్కసారి ఆగిపోతే! "...ఎంత హాయిగా ఉంటును??...తనకి శిక్ష చాలదూ?"

శ్రీనివాస్ గదిలోని వస్తువులు అతివేగంగా శ్రీనివాస్ చుట్టూ తిరిగిపోతున్నాయి. వికృతంగా - వికటంగా నవ్వుతూన్న రాఘవరావులు లక్షరూపాల్లో శ్రీనివాస్ మీద మీదకి వచ్చేస్తున్నారు...దగ్గరగా - మరింత దగ్గరగా - వచ్చేస్తున్నారు...

"రాఘవరావ్!!!"...గట్టిగా భయంగా-భయంకరంగా అరచి కళ్లుమూసుకున్నాడు శ్రీనివాస్...శ్రీనివాస్ మళ్ళీ కళ్ళు తెరవలేదు.







## వినాయక చవితికి ఆంజనేయ దండకం!

### (మొదటి బహుమతి రు. 10 లు)

వినాయకచవితికి స్నేహితులు అందరూ బొమ్మలు కొనుక్కోవడం చూసి గోపాల్ వాళ్ళ నాన్నదగ్గరికి వెళ్లి "నాన్నా! నాకో రూపాయి ఇయ్యి, విఘ్నేశ్వరునిబొమ్మ మంచిది కొనితెస్తా, రేపు చవితికదా" అని బ్రతిమాలాడు. వాళ్లనాన్న కోపిష్టి. పైగా బొమ్మకోసం అనవసరంగా రూపాయి ఖర్చు పెట్టడ మెందుకు అని "బొమ్మకు రూపాయి ఏమిటిరా? కొంచెం నల్లమట్టి తీసుకొనిరా. నేనే తయారుచేస్తాను వినాయకుని బొమ్మ" అన్నాడు.

ఎలా అయితేనేమి పెద్దబొమ్మ ఒకటి లావుపాటి తొండంతో, భయంకరమైన కళ్ళతో, కడవలాంటి బొజ్జతో చూస్తే ఝుమఝుమనేలా తయారుచేశాడు ఆయన. చవితినాడు ఉదయం గోపాల్‌ను పిలిచి ఒకఅణా ఇచ్చి "వినాయక వ్రతకల్పం కొని తీసుకు రమ్మన్నాడు.

గోపాల్ "ఆంజనేయ దండకం" తెచ్చి వాళ్ళనాన్నకు ఇచ్చాడు.

ఆయన ఉగ్రుడై పోయి "ఇదేమిటిరా వినాయక చవితికి ఆంజనేయదండకం తెచ్చా"వని కోప్పడ్డాడు.

గోపాల్ అన్నాడుకదా:— "నాన్నా నువ్వుచేసినబొమ్మ చూస్తే నాకు చాలా భయంగా ఉంది. ఆంజనేయ దండకంచదివితే ఆ భయం అయినా పోతుందని కొన్నాను"- అని.

కస్తూరి సదాశివరావు
(హైదరాబాదు)

* * *

## 'పానిపట్ యుద్ధంలో గెల్చింది నేనే'

### (రెండవ బహుమతి రు. 5 లు)

నేనప్పుడు మూడవఫారము చదువు చున్నాను. మాక్లాసులో శేషు, లత అని ఇద్దరు కొంటెపిల్ల లుండేవారు. మాకు సోషల్ స్టడీస్ చెప్పటకొ యేడాది క్రొత్త మాష్టారు వచ్చారు. మాష్టారు క్రొత్తవారగుట వలన వాళ్లిదరు ఆయన క్లాసులో చుక్కలాడి ఆడుతూండేవారు. ఒకరోజున....

సోషల్ మాష్టారు మొగలాయీ సామ్రాజ్య స్థాపననుగురించి చెప్పుచున్నారు. "ఢిల్లీ సుల్తానులలో కడపటివాడైన ఇబ్రహీం లోడి అసమర్థుడును, క్రూరుడును అయి ఉండెను. అందువలన ఇతనిదగ్గరవాడైన దౌలత్ ఖాన్‌లోడి పంజాబు గవర్నరుగా నుండి ఇబ్రహీంలోడి నోడించుటకు మొగలు రాజగు బేబరు నాహ్వానించెను. బేబరదివరకే మనదేశముమీద కన్ను వేసి యుండెను. అతడు సంతోషముతో తనసైన్యమును వెంట బెట్టుకొనివచ్చి ఇబ్రహీంలోడిని పానిపట్టు వద్ద ఓడించెను. పానిపట్టుయుద్ధము మనదేశమందు మొగలాయిరాజ్యస్థాపనకు కారణ మయ్యెను"- అని చెప్పుచూ శేషు, లతలు చుక్కలాడి ఆడుటను చూసిరి.

మాష్టారు గబుక్కున "ఏయ్, లతా! పానిపట్టు యుద్ధమున ఎవరుగెల్చిరి?" అని అడిగెను. పాపము వారిద్దరు చుక్కలాడి ఆడుటయందు పూర్తిగా మునిగియుండిరి. వెంటనే లతలేచి "ఇంకా పూర్తికాలేదండి. ప్రస్తుతము నేనే గెల్చినట్లండి" అని జవాబిచ్చెను. వెంటనే క్లాసంతా గొల్లుమనిరి.

—చంద్రం (బందరు)

* * *

## 'నైరే మద్రాసు గవర్నర్'

### (రెండవ బహుమతి రు. 5 లు)

అవి మేము మిడిల్‌స్కూల్‌లో చదివే రోజులు. పరీక్షలు దగ్గరకు వచ్చినవి. ఆ దినము హిస్టరీ పరీక్షలకు హాజరయి వచ్చినాము. బయటికివచ్చిన ఎవరు ఎలా వ్రాశారో ఒకర్ని ఒకరము టెస్టు చేసుకొను చున్నాము. అంతలో మా మిత్రుడువచ్చి మద్రాసు గవర్నరు ఎవరని మమ్ములను అడిగినాడు (ఇప్పటికి షుమారు 14 సం॥లు లెండి) మేము అతను వ్రాసినది ఏమని అడిగాము. అతనేమో ఎవరూలేడని వ్రాసినాడట. మేము ఉన్నాడని ఎంతచెప్పిన వినలేదు. అసలు ఇతనికి చెప్పినవాడు బయటికి వచ్చినాడు. అతనినిపోయి అడగగా మా మిత్రుడేమో ఉర్దూలో(మహమ్మదీయులైనందున) "కోన్‌రే మద్రాస్ గవర్నర్" అని అడిగాడట. అందుకు అతను ముక్తసరిగా "నైరే" అని చెప్పినాడట. దానివలన ఇతడు లేడు అని వ్రాసినాడట. తరువాత మేము "సర్ ఆర్చిబాల్డ్ నై" అని చెప్పి వాళ్ళ సంభాషణకు నవ్వుకొని వచ్చినాము.

వై. వి. సుబ్బయ్య (గద్వాల)

* * *

## 'అయ్యో ఒకకానీ'

### (రెండవ బహుమతి రు. 5 లు)

మా కాలేజీలో ప్రతి సంవత్సరం చిత్రలేఖనం పోటీలు జరుగుతాయి. పోటీలో గెలుపొందిన చిత్రములు "మాగజైన్"లో ప్రకటిస్తారు.

ఒకఏడు నాకుకూడా పోటీలో పాల్గొనాలని బుద్ధిపుట్టి ఒకచిత్రం వేశాను. నాకు నిజంగా చిత్రలేఖనం రాదు. నేవేసినచిత్రం గుఱ్ఱం పక్కనునుంచుని ఉన్న వీరుడు. అడుగున ఏమీ వ్రాయకుండా పోటీకి పంపించాను.

పోటీలో గెలుపొందినది "అయ్యో ఒకకానీ" అని వ్రాసిఉన్న చిత్రమని తెలిసి నిరుత్సాహపడ్డాను. ఆ తరువాత మాగజైను వచ్చినతర్వాత చూస్తే అది నా చిత్రమే. అప్పుడుగాని అర్థంకాలేదు. నేను చిత్రించిన వీరుడు బక్కచిక్కిన యాచకుడుగాను, జీనుతోకూడి ఉన్న గుఱ్ఱం బొంత మోస్తున్న గాడిదగానూ ఉన్నాయని అప్పుడు తెలిసింది. ఆ పేరు ఎవరువ్రాశారా అని ఆరాతీస్తే మా డ్రాయింగు లెక్చరరు బొమ్మచూసి అడుగున పేరు వ్రాశానని చెప్పారు.

అసలు సంగతి ఎవరికీ చెప్పకుండా గుంభనగా ఉండిపోయాను.

"సుదేవ్" (నాగవరప్పాడు)

* * *

## చదువుకు తిండికి లంకె

### (రెండవ బహుమతి రు. 5 లు)

మేము హైస్కూలులో చదివిన రోజులలో మా మాష్టారుగారు రాముని ఒక ప్రశ్న వేసినారు. అతను జవాబీయలేదు. రామునితో మాష్టారు ఏరా నీకు తిండి వంటబట్టినట్లు చదువు వంటబట్టుట లేదేరా యని ప్రశ్నించారు. రాము మాష్టారితో చదువేమో మీరు చెప్పుచున్నారు. తిండి ఏమో మా తల్లి పెట్టుచున్నది అని సమాధానమిచ్చాడు.

మంతెన జానకిరామ రాజు
(ఖాజీపాళెం)

# మానవ దేహస్థితి

## దంత నిర్మాణము: అందులో విభాగాలు

డా॥ గాలి బాలసుందరరావు

వెనుకటి వ్యాసంలో పెదవులను గురించి తెలుసుకున్నాము. పెదవులు నోటికి కవాటములవంటివనీ, అవి కొన్ని ప్రత్యేక పరిస్థితులలో తప్ప నోటిని మూసిఉంచుతవని తెలుసుకున్నాము. ముక్కులు దిబ్బడ వేసినప్పుడుతప్ప నోటితో ఎవ్వరూ ఊపిరి పీల్చరు. పెదవులు తెరిచిచూస్తే నోట్లో కనిపించేది చిగుళ్ళు-పళ్ళు.

చిగుళ్ళు దవడ ఎముకను చుట్టివున్న మూకస్ మెంబ్రేనునుంచి ఏర్పడ్డవి. ఇవి పుష్కలమైన రక్తస్రావము కలిగి, నున్నగా జటిగా ఉంటవి. చిగుళ్ళకు వచ్చే వాపును గంజివైటిస్ అంటారు. చిగుళ్ళ జబ్బులకు పళ్ళ జబ్బులకు సంబంధం ఉన్నది. అందుచేత చిగుళ్ళ అందులో ఇమిడిఉండే పళ్ళు వాటి నిర్మాణము అందులో భాగములను గురించి మున్ముందు తెలుసుకోవాలి.

పళ్ళు మేగ్జిల్లా అనే పై దవడ ఎముక నుండి మేండిబుల్ అనే క్రింది దవడ ఎముకలోను గుర్రపులాడంలాగ, ఒక ఆర్చిగా మొలిచిఉంటవి. చెవితమ్మి క్రింది భాగంలో వున్న కీలువల్ల క్రింది దవడ ఆడుతూఉండి నోరు తెరవడానికీ, మూయడానికీ సహకరిస్తూ ఉంటుంది. పై దవడ శిరఃపేటికలో భాగమై కదలనిదై ఉంటుంది. పలువరసలు రెండూ ఒకదానితో ఒకటి అనుకొని ఉంటవి. ఒక్కొక్కప్పుడు క్రింది వరసలో ముందుపళ్ళు పై వరసలోనికి చొచ్చి ఉండవచ్చును. సకృత్తుగా క్రింది వరసలోకి పై పళ్ళు చొచ్చుకుని ఉండవచ్చును. కాని ఇది సాధారణమైన స్థితి కాదు. రెండు వరసలు ఒకదానిమీద ఒకటి నిలబడి ఉండడమే సహజస్థితి. ఈ వ్యత్యస్థస్థితి ముందు పళ్ళకు మాత్రమే! క్రింది దంతములన్నీ పై దంతములతో పోటీగా నిలబడే ఉంటవి. దవడ ఎముకలలో ఉన్న గుంటలలో పళ్ళు దిగబడి ఉంటవి. వాటివాటి విధులనుబట్టి పళ్ళ ఆకారము, నిర్మాణము ఉంటవి. ఆ వివరాలు తరవాత తెలుసుకుందాము. కాని అన్ని పళ్ళకూ సాధారణమైన నిర్మాణం సంగతి తెలుసుకుంటేనేగాని పళ్ళ వ్యాధులు ఎందుకు వస్తవో, వాటిని నిరోధించడం ఎట్లాగో అర్థం కాదు.

వయస్కులలో క్రింది వరసలో 16, పైవరసలో 16; మొత్తం 32 పళ్ళు ఉంటవి. ఒక్కొక్క పనిచేసే పన్ను ఒక్కొక్క ఆకృతి కలిగివుంటుంది. కాని అన్ని పళ్ళ యొక్క నిర్మితి (స్ట్రక్చర్) ఒకటే. పన్ను క్రిందిభాగం దవడ ఎముకలో భూమిలో నాటిన రాయిలాగా నాటబడి ఉంటుంది. ఈ భాగమును 'రూట్' లేక దంతమూలము అంటారు. దవడ ఎముకకు పైన కనబడే తెల్లని భాగమును 'క్రౌను' అంటారు. క్రౌను అంటే కిరీటము అని అర్థము. దవడ ఎముకలో ఏర్పడిన గోతులనుంచి ఒకటినుండి మూడు వ్రేళ్ళవంటి నిర్మితీవిశేషాలతో పన్ను నాటబడి ఉంటుంది. దవడ ఎముకకు పంటి రూట్‌కు మధ్య పెరిడోంటల్ మెంబ్రేను అనే పొర ఉన్నది. పెరి అంటే చుట్టిఉన్న డోంటల్ అంటే దంతసంబంధమైన అని అర్థము. దంతమును చుట్టిఉన్న పొర అని ఈ మాటకు అర్థము. సంస్కృత భాషలో పంటికి దంతము అని పేరు. లాటిన్, ఆంగ్లోశాగ్జన్ ఫ్రెంచి భాషలలో కూడా 'డాన్ట్' అనే దంతానికి పేరు. ఇటువంటి మాటలు చాలా సంస్కృత పదములకు సన్నిహితములైనవి ఉన్నవి. ఇది గమనింపదగ్గ విషయము. ఈ పెరిడోంటల్ మెంబ్రేను, దవడ ఎముక పైకి లేచి పంటికీ, దవడ ఎముకకూ మధ్యగా చిగురుగా ఏర్పడుతుంది. చిగురు నునుపుగా గట్టిగా ఎర్రగా ఉండి మంచిరక్తం సరఫరా కలిగి ఉంటుంది. దంత కిరీటము ఎనామెల్ అనే అతి ఘనపదార్థంతో కప్పి ఉంటుంది. కాని కిరీటమంతా ఎనామెల్‌తోనే నిర్మితమై ఉండదు. ఎనామెల్ ఒక పొర మాత్రమే. ఈ ఎనామెల్ పొర క్రింద డెంటైన్ అనే ఏనుగదంతంవంటి పదార్థము ఉన్నది. అదీ ఒక పొరే. దంతకిరీటం అంతరాళంలో, ఒక రకమైనమాంసం గుజ్జుతో నిండి ఉండి ఖాళీప్రదేశం ఉన్నది. దీనిని పల్ప్‌కేవిటీ అంటారు. పల్ప్ అంటే గుజ్జు అని అర్థము. ఈ పల్ప్‌కేవిటీ మూలములో భాగముల గుండా దవడ యెముక అంతరాళంలో వున్న మెరో అనే గుజ్జువంటి పదార్థంతో ఒకనాళం ద్వారా సంబంధం కలిగి వుంటుంది. ఈ నాళమును రూట్ కెనాల్ అంటారు. కెనాల్ అంటే కాలువ. ఈ కాలువలో నరములు పల్ప్‌కేవిటీద్వారా పంటికి కావలసిన ఆహారమును సరఫరాచేసే రక్తనాళములో ఉన్నవి.

పెరిడోంటల్ మెంబ్రేనుకూ పంటిమూలానికీ మధ్య సిమెంటు పొర వున్నది. పెరిడోంటల్ మెంబ్రేను దిండులాగావుండి, పంటికి తగిలే దెబ్బలధాటిని కొంతవరకు తగ్గిస్తుంది. అందుకనే చిన్నపళ్ళు కదిలిస్తే కదులుతున్నట్లుగా అనిపిస్తుంది.

పళ్ళల్లో చాలారకములు వున్నవని చెప్పాను. పయివరసలో ముందున్న నాలుగు పళ్ళు ఉలివంటి ఆకారం గలిగి ఉంటవి. ఈ పళ్ళకు దంతమూలము ఒకటిగానే ఉంటుంది. ఇవి ఆహారపదార్థమును కొరకడానికి పనికి వస్తవి. వీటిని ఇన్‌సైజర్స్ అంటారు. ఇన్‌సైజ్ అంటే ఇంగ్లీషుభాషలో కత్తితో కోయడం అని అర్థము. ఈ నాలుగుపళ్ళకూ అటూ యిటూ కోరపళ్ళు ఉంటవి. వీటిని కస్పిడ్ అంటారు. వీటికి క్రౌన్‌లో ఒకే భాగం వుంటుంది. ఇవి క్రిందివరసలో రెండు పైవరసలో రెండు ఉన్నవి. వీటి తరవాత రెండుతలలున్న రెండవ బైకస్పిడ్ దంతములు. వాటివెనుక మూడు నాలుగు తలలువున్న మోలార్స్ అనే దంతములు నాలుగు ఉన్నవి. ఈ పదహారుపళ్ళు గుర్రంలాడంలాగా, ఆర్చిలాగా అమరివుంటవి.

దంతములు ఆహారమును నమలి సెలైవాతో కలిపి ముద్దచేయడానికి దవడ ఎముకలను సరియైన స్థానంలో వుంచడానికీ, మాట్లాడ్డంలో కొన్ని శబ్దములను ఉచ్చరించడానికీ అవసరము. మానవుల జీర్ణకోశంలో ఇవి ఒక భాగము. కాని పళ్ళులేకపోయినా మానవుడు జీవించగలడు. కాని జంతువులలో, ముఖ్యంగా మాంసాహారులైన జంతువులలో పళ్ళు లేకపోతే జీవితం సాగదు.

ముక్కులాగా, చెవిలాగా దంతములు జన్మతో అంకురించి ఆజన్మాంతమూ ఉండిపోవు. బాల్యంలో ఒక్కొక్కరకమైన పళ్ళు ఒక్కొక్క వయస్సులో అంకురించి ఒక వయస్సులో ఒకక్రమంలో రాలిపోయి మళ్ళీ ఒకక్రమంలో తిరిగి మొలిచి, మళ్ళీ ఒక వయస్సులో రాలిపోతవి. ఈ పళ్ళు మొలచేకాలం అందరిలోనూ ఒకేవిధంగా వుండదు. కాని పాలపళ్ళు అసలుపళ్ళు మొలిచే క్రమం క్రింద సూచిస్తున్నాను.

పసిబిడ్డలో మున్ముందు—ముందు రెండు ఇన్‌సైజారులు వస్తవి. ఇవి సాధారణంగా 6వ మాసం నుంచి ఎనిమిదవ మాసంలోగా మొలుస్తవి. వాటిప్రక్క ఇన్‌సైజారులు ఎనిమిదవ మాసం నుంచి పదవ మాసంలోగా మొలుస్తవి. ఆప్రక్క దంతములు 12వ మాసమునుంచి 14వ మాసంలోగా మొలుస్తవి. క్రిమోలార్స్ 18వ మాసంనుండి ఇరవైయో మాసంలోగా మొలుస్తవి. రెండు సంవత్సర

ములు పొందలు రెండున్నర సంవత్సరముల లోగా మిగతా దంతములు మొలుస్తవి.

పళ్లు చిగుళ్లలోవున్న మొగ్గలవంటి నిర్మితులనుంచి మొలుస్తవి. ఈ పంటి మొగ్గలు (tooth buds) పిండస్థితిలోనే అంకురిస్తవి. పైన ఉదహరించిన కాలంలో సాధారణంగా పాలపళ్లు మొలుస్తవి. కాని కొన్ని మాసముల వ్యత్యాసం వుంటే తప్పులేదు. కాని సంవత్సరందాకా పళ్లే మొలవకపోతే, ఏదో

# మనము-మనదేహస్థితి

లోటువుండి ఉండాలి. ముఖ్యంగా ఆహారంలో కాల్షియం తక్కువైతే ఇలా జరగవచ్చును.

అసలు దంతములు, పై క్రమంలో 7, 8, 11 10, 11 సంవత్సరములలో మొలుస్తవి.

ఒక్కొక్కప్పుడు పాలపన్ను రాలకుండానే అసలుపన్ను మొలిచి గొగ్గిపళ్ళు ఏర్పడుతవి. మరొకప్పుడు మొలిచే ఒకపన్ను, మొలిచిన మరొక పంటిలోకి మొలిచి, పైకి రాక బాధ కలిగించవచ్చును. ఈ స్థితిని "ఇంపాక్టెడ్ టూత్" అంటారు. దంత వ్యాధులను గురించి చర్చించడానికి ముందు చిగుళ్ల వ్యాధులను గురించి చర్చించడం అవసరం. ★




(1) ఓల్ ఫాక్టరీ నర్వ్ (2) ఆన్‌టెరియర్ ఎత్మోయిడల్ ఆర్టెరీ (3) ఆఫ్థాల్మిక్ నర్వ్ (4) మాక్సిలరీ నర్వ్ (5) స్ఫీనో పాలటైన్ గాంగ్లియాన్ (6) ఆన్‌టీరియర్, మిడిల్ అండ్ పోస్టీరియర్ సుపీరియర్ ఎల్ వియోలర్ నర్వ్స్ (7) మాక్సిలరీ లింఫ్‌నోడ్సు (8) ఆన్‌టీరియర్ పాలటైన్ నర్వ్ (9) గ్రేటర్ పాలటైన్ ఆర్టెరీ (10) బుస్సినేటర్ లింఫ్ నోడ్సు (11) లింగ్వల్ నర్వ్ (12) ఇన్‌ఫీరియర్ ఎల్ వియోలర్ నర్వ్ (13) లింగ్వల్ ఆర్టెరీ అండ్ వెయిన్ (14) మైలోహాయిడ్ నర్వ్ అండ్ ఆర్టెరీ (15) సూప్రమండిబ్యులర్ లింఫ్‌నోడ్సు (16) సబ్ మెంటల్ లింఫ్‌నోడ్సు (17) సబ్‌మాక్సిలరీ లింఫ్ నోడ్సు (18) ట్రాఖియా (19) సెన్సరీరూట్ ఆఫ్ ట్రైజిమినల్ నర్వ్ (20) మోటార్ రూట్ ఆఫ్ ట్రైజిమినల్ నర్వ్ (21) సూపర్‌ఫీషియల్ టెంపోరల్ ఆర్టెరీ అండ్ వెయిన్ (22) మండిబ్యులర్ నర్వ్ (23) స్ఫీనోపాలటైన్ ఆర్టెరీ (24) ఇంటర్నల్ మాక్సిలరీ ఆర్టెరీ (25) పరోటిడ్ లింఫ్ నోడ్సు (26) ఎక్స్‌టర్నల్ కరోటిడ్ ఆర్టెరీ (27) టెరిగాయిడ్ వీనస్ ప్లెక్సస్ (28) ఒరోఫారింక్స్ (29) ఆన్‌టీరియర్ అండ్ పోస్టీరియర్ ఫేషియల్ వెయిన్స్ (30) ఎక్స్‌టర్నల్ మాక్సిలరీ ఆర్టెరీ (31) హైపోగ్లోసల్ నర్వ్ (32) వాగస్ నర్వ్ (33) ఎక్స్‌టర్నల్ జుగులర్ వెయిన్ (34) ఇన్‌టర్నల్ కరోటిడ్ ఆర్టెరీ (35) ఇసోఫాగస్ (36) ఇన్‌టర్నల్ జుగులర్ వెయిన్.



భారతదేశంలో శ్రీ మాగ్డొనాల్డ్ స్థానంలో బ్రిటిష్ హైకమిషనర్ పదవి స్వీకరించిన సర్ పాల్ గోర్-బూత్ ఢిల్లీలో ఈనెల 4 న ప్రధాని శ్రీ నెహ్రూను కలుసుకొన్నారు.

న్యూఢిల్లీ లేఖ

శ్రీకృష్ణ

# హిందీ 'త్రిమూర్తుల' వల్ల దేశం మూడు ముక్కలు అవుతుందా?

ఈ వారంలో మూడు సంఘటనలు ప్రముఖమైనవిగా కన్పిస్తున్నాయి. రాష్ట్రపతి, గోసంవర్ధన ఆవశ్యకతనుగూర్చి ప్రసంగించారు. దేశానికి, ముఖ్యంగా హిందీ భాషకు శ్రీ పురుషోత్తమదాస్ టాండన్ చేసిన సేవను శ్లాఘిస్తూ వారాంతంలో మరో ప్రసంగంకూడా చేశారు. హిందీభాషావ్యాప్తికి త్రిమూర్తులుగా వ్యవహరిస్తున్న డా॥ రాజేంద్రప్రసాద్, శ్రీ పురుషోత్తమదాస్ టాండన్, సేఠ్ సాహెబ్ గోవిందదాస్ గారల ప్రసక్తి లేకపోతే, స్వతంత్ర భారతదేశచరిత్ర వేరొక విధంగా లిఖించవలసివచ్చేది. డా॥ రాజేంద్రప్రసాద్ హిందీ ఉద్యమానికి అగ్రనాయకుడని అందరు ఎరిగిన రహస్యమే. వారి మాటే కనుక చెల్లుబాటు అయితే, ప్రపంచంలో ఏ మూల అయినాసరే హిందీ తప్ప మరొక భాష కనిపించదు; వినిపించదు. భారతదేశంలో బ్రాహ్మణమత పునరుద్ధరణకు వారు శాయశక్తులా కృషి చేశారు.

క్రియ ఎప్పుడూ ప్రతిక్రియకు సమానంగా ఉంటుందని న్యూటన్ తృతీయ సూత్రం నిర్వచిస్తోంది. డా॥ రాజేంద్రప్రసాద్ హిందీభాషా ఉద్యమానికి హిందీ భాషేతర ప్రాంతాలలో తగు పరిణామాలు సంభవిస్తున్నవి. ఆయన ఇంగ్లీషు స్థానంలో హిందీని ప్రతిష్ఠించడానికి ప్రయత్నించి, ఆస్థానంలో ప్రాంతీయ భాషలను మాత్రమే ఏర్పాటు చేయగలిగారు. దేశంలోని వివిధ కుల, మత వర్గాలవారినందరిని ఏకజాతిగా బ్రిటిష్‌వారు సమైక్యపరచడం విధి వైపరీత్యంగా కనిపిస్తుంది. భారతదేశం మళ్ళీ ముక్కలు అయిందంటే, ఆ కీర్తి నిజంగా హిందీ భాషావ్యాప్తికి నడుం కట్టిన త్రిమూర్తులకే దక్కుతుంది.

వెనుకటికి షా-ఇ-ఆలం అనే మొగల్ చక్రవర్తి ఒకరు ఉండేవారు. ఆయన సామ్రాజ్యం ఢిల్లీనుంచి పాలం (ప్రస్తుతం విమానాశ్రయం ఉన్న ప్రదేశం) వరకు విస్తరించి ఉండేది. హిందీభాషా ఉద్యమం ఇప్పటివలెనే ఇకమీదట కొనసాగితే, శ్రీ నెహ్రూ నిష్క్రమణానంతరం భారత ప్రభుత్వానికి కూడా ఆ గతే పడుతుంది.

* * *

ఇక గోసంవర్ధనానికి సంబంధించినంతవరకు, ఒక అమెరికన్ నిపుణుని నివేదికలో ఉన్న ఈదిగువ విషయాలు పరిశీలిస్తే చాలు: "భారతదేశంలో జంతు సంతతి విపరీతంగా ఉన్నది. స్థానికంగా సరుకుల రవాణాకు ఎడ్లను వినియోగిస్తారు. ఆవులు కొద్ది పరిమా

ణంలో పాలు ఇస్తాయి. గొర్రెలు, మేకలు, పందులు, కోళ్ళు మొదలైన వాటివల్ల మాంసం, గుడ్లు లభిస్తున్నాయి. అయినా ఇంకా అసంఖ్యాకమైన జంతువులు నిరుపయోగంగా ఉన్నాయి. ఇప్పుడు ఉన్న పశువులలో సగానికిసగం నిరుపయోగంగా ఉన్నవని కొందరు నిపుణుల అంచనా. వీటిని అంతమొందిస్తే పాలఉత్పత్తి సగటున పెరుగుతుంది. వ్యవసాయానికి పనికివచ్చే పశువులు ఎక్కువగా పనిచేయగలుగుతాయి. నిరుపయోగంగా ఉన్న జంతువులకు ఇప్పుడు పెడుతున్న గింజలు మొదలైనవాటిని మానవులు వినియోగించుకోవచ్చు."

* * *

ప్రణాళికా సంఘ తాత్కాలిక ఉపాధ్యక్షుడుగా వ్యవహరిస్తున్న శ్రీ గుల్జారీలాల్ నందా కూడా ఈ వారం వార్తలలో ప్రముఖస్థానం ఆక్రమించారు. ప్రణాళికా సంఘంలోని వారి సహచరుడు శ్రీ శ్రీమన్నారాయణ మద్యనిషేధ సంఘానికి తాము అధ్యక్షుడుగా పని చేసిన సంగతి విస్మరించలేదు. ఈ సంఘం సమర్పించిన నివేదికే ఇప్పుడు యథోచితంగా అమలు అవుతోంది.

మొదటి విషయం—ఆర్యులు ఎంతగా మద్యం సేవించారంటే, ఇప్పుడసలు "సోమం" లో కలిసే పదార్థాలే కనిపించకుండా పోయాయి. హిందువులలో కొన్ని వర్గాలవారికి ఈనాటికీ కూడా కొన్ని కర్మలు జరుపవలసి వచ్చినప్పుడు విధిగా మద్యం ఉండాలి.

# న్యూఢిల్లీ లేఖ

మహమ్మదీయ మతంలో మద్యం ఏ విధంగా నిషేధింపబడిందో ఇక్కడ అట్లా నిషేధింపబడలేదు. అయినప్పటికీ రెండు ముస్లింరాజ్యాలలో—ఇరాన్, టర్కీ—ప్రభుత్వం మద్యం వ్యాపారాన్ని గుత్తకు తీసుకొన్నది.

మద్యనిషేధం అమలు కాని రాష్ట్రాలలో దానిని అమలు చెయ్యాలని శ్రీ గుల్జారీలాల్ నందా అధ్యక్షతను జరిగిన సమావేశం విజ్ఞప్తి చేసింది. అయితే బహిరంగంగా జరిగే మద్యపానానికి మాత్రమే నిషేధం వర్తింపజేయాలని ఆ సమావేశం అభిప్రాయపడ్డినట్లు కనిపిస్తుంది. మృదువుగా చెప్పాలంటే, ప్రైవేటుగా మద్యం సేవించడాన్ని నిషేధించడమే అవసరం. ఈ పని జరిగితే, బహిరంగంగా మద్యనిషేధాన్ని ప్రబోధిస్తున్న ఎందరో "ఋషులు" బయట పడుతారు.

ఢిల్లీ నగరం తాలూకు పింఛన్‌దారులు డా॥ యుధ్వీర్ సింగ్, శ్రీ గోపీనాథ్ అమన్ కూడా పై సమావేశంలో పాల్గొన్నారు. ఇక్కడ కొద్ది వివరణ అవసరం. వీరిద్దరు వెనుకటి ఢిల్లీ రాష్ట్రంలో ఒకప్పుడు మంత్రులుగా ఉండేవారు. ఆ రాష్ట్రం రద్దు అయిన తరువాత, ప్రజా సంబంధాల సంఘం, పరిశ్రమల సలహా మండలుల అధ్యక్షులనే పేర్లతో రెండుపదవులు, వీరికోసం సృష్టించబడ్డాయి.

వీరిజీతం నెలకు రు 1000 లు మాత్రమే. జీతం తీసుకుంటూ, ఎప్పుడు సెలవులు అనుభవించే వారు ఎవరుఅంటే, వీరేనని వేలెత్తి చూపదగిన వారు. ఈఏడు తీసుకున్న వివిధ చర్యల ఫలితంగా నగరంలో మద్యపానం చాలావరకు పరిమితం అయిందని, నగర పాలక సంఘాధ్యక్షునితోసహా, ఢిల్లి ప్రతినిధులంతా వక్కాణించారు.

అయితే "ప్రెస్ క్లబ్ ఆఫ్ ఇండియా"కు మాత్రం మద్యం విక్రయానికి కొత్తగా లైసెన్సు ఇచ్చారు. ఈ క్లబ్ ఆదాయంలో అధికభాగం మద్యం విక్రయించటం ద్వారానే వస్తోంది. ప్రెస్ క్లబ్ న్యూఢిల్లీలో ఉన్నందువల్ల ఢిల్లి త్రిమూర్తులు—నగరపాలక సంఘాధ్యక్షుడు, పై రెండు సంఘాల అధ్యక్షులు—దానిని దర్శించే అవకాశం లేకపోయింది. ఈ చిన్న క్లబ్‌లో ఒక్క ఏడాదిలో రు 26 వేలు ఖరీదు చేసే మద్యం అమ్మడయింది. ప్రజా సంబంధాల సంఘం అధ్యక్షుడు దీనిని ఏమంత పెద్ద మొత్తంగా భావించరాదు. ఆ సంఘము ఆయన అధ్వర్యం క్రింద ఉండటమే ఇందుకు ప్రథమకారణం. కాని అసలువిషయమేమంటే మద్యనిషేధం సక్రమంగా అమలు అవటం కాకపోవటం ఈ క్లబ్‌లో జరిగే అమ్మకాలను లెక్కలోకి తీసుకోనడంపైనే ఆధారపడి ఉంటుంది.

* * *

(కితంసారి పత్రికా విలేఖరుల సమావేశం 62 వ పేజీ చూడండి)



# తెలుగు వెలుగులు 59

ఎనభై తొమ్మిదేండ్లు పైబడినా, పంచ పంచ ఉషఃకాలంలోనే లేచి, చెక్కు చెదరని దేహపటిమతో చకచకా అంగలు వేస్తూ, అంగాంగలను పిడచగట్టించే చలిలోను కృష్ణలో జలకమాడి 'వందే వంద్యం సదానందం వాసుదేవం నిరంజనం, ఇందిరాపతి మాద్యాది వరదేశ వరప్రదం' అంటూ మధ్వాచార్యులవారి ద్వాదశస్తోత్రం, రాఘవేంద్ర స్తోత్రం, హరివాయుస్తుతి మొదలయినవి అనుసంధానిస్తూ ఫాలభాగంపై పచ్చని గోపీచందనంతో, తెల్లని గడ్డంతో అలనాటి ఋషులను తలపిస్తూ విజయవాడ పౌరులకు వింతగొలిపే ఆ ఆరబండిన పండితుడు శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు.

ఆయనలో నేటికీ బాల్యోత్సాహం పొంగులు వారడానికి, శరీరదార్ఢ్యం సడలక పోవడానికి కారణం నియమబద్ధమైన జీవితం, ముఖ్యంగా ఆహార నియమమూ, కాయకష్ట గౌరవం గ్రహించడమూను.

పందొమ్మిదవ యేట వినుకొండలో జరిపిన మొట్టమొదటి అవధానంలో శంఖధ్వనిలాగ వినబడిన ఆయన కంఠధ్వని నేటికీ కర్ణపేయంగానే ఉంది.

అన్ని రాజాస్థానాలను అవధాన ప్రణిధానంతో ఆనందింపజేసిన "అవధాన శిరోమణి" ఆయన; అరసవిల్లిలో పండిత మహాసభలో

"అనిరి పురజను లవనిలో
అని రిపు రజనుల నడంప హంసుడవనుచున్
గనివని గొల్చెద రర్థులు
గని వని గొల్చెద రరాతిగములు నృసింహా."

అనే ఒక్క ఆశుకందపద్యానికే అప్పుడు కని విని ఎరుగని సన్మానం పొందిన ఆశుకవి ఆయన; తర్కాద్వైతాలలో తిరుగు లేని పాండితి సంపాదించి, శాస్త్రార్థాలు చేసి పండిత ప్రకాండుల తలలూపజేసిన "తర్క విద్వదుభయ కవిమిత్రుడు" ఆయన.

పది పన్నెండేండ్లపాటు ఆంధ్రోపాధ్యాయుడుగా పనిచేశాడు; తండ్రి తద్దినానికి అధికారులు సెలవివ్వలేదని ఆగ్రహించి ఉద్యోగం మానివేసి, "మాతృభాష" అనే సంస్కృత పత్రిక కొంతకాలం నడిపాడు. రెండు తరాలపాటు నిరంతరం సంస్కృత ప్రచారం ధర్మదీక్షతో చేసిన మహా "మహోపధ్యాయుడు".

"సంస్కృతం ఒకానొకప్పుడు శిష్టజనుల వ్యవహారంలో ఉండేది. అది ప్రాతిపదిక అయితే, భారతదేశ సమైక్యమే కాక ప్రాచీన ప్రాభవం కూడా సంపాదించగలం" అని ఆయన విశ్వాసం. కనుకనే సంస్కృత భాషా ప్రచారం ప్రారంభించాడు. ప్రచారకునికి కావలసిన హంగంతా ఆయనకు ఉంది. ఆయన మహావక్త; హరికథకుడు; సరసహృదయుడు; సద్యస్స్ఫురణ ఆయన సొమ్ము; సభ ఎంత పెద్దదైతే అంత గొప్పగా వికసిస్తుంది ఆయన వక్తృత్వం.

కేవలం ప్రచారంతో ఏమి జరుగుతుంది? సంస్కృతం క్లిష్టమనే భ్రాంతి జనంలో ఉంది. దానిని పోగొట్టడానికి ఆయన "మనకు తెలీకుండానే మన వ్యవహారంలో సంస్కృతపదాలను సగానికిపైగా వాడుతున్నాము" అని నచ్చజెబుతూ, అలాటి పదాలతోనే 'సంస్కృత బాలబోధిని' మూడు భాగాలు, వాల్మీకి చరిత్ర వ్రాశాడు.

ఈ వాచకాల సరళతకు ముగ్ధులైన జర్మను పండితులు ఆయనను సంస్కృతభాషాబోధన కోసం తమ దేశానికి రావలసిందని కోరారు. "ఈ వయస్సులో ఈ కర్మణ్యాదేశం వదలి ఆ కర్మణ్యదేశవాసమా?" అని నవ్వి ఊరుకున్నాడు ఆయన.

వృద్ధాప్యంలో చెట్టంత కొడుకును కోల్పోయినా, మనస్సును చిక్కబట్టుకొని, ఎప్పుడూ ఉచితంగా వందలాది విద్యార్థులకు సంస్కృత విద్యాదానం చేస్తున్న ఆయనను రాష్ట్రపతి గౌరవించి యావజ్జీవ వార్షికం ఏర్పాటుచేశారు.

సంస్కృత భాషావ్యాప్తికి అంకితమైన ఆయన జీవితం గతానికి ఆగతానికి వెలుగు వంతెన. ఆ వంతెనపై ఆయన విద్యాసంతతి జ్ఞానయాత్ర సాగిస్తూనే ఉంటుంది. ★




"ఏమండీ!" అంటూ ఎవరో పిలిచేసరికి, నిద్రముంచుకొస్తున్నా నిద్రపోవడానికి వీల్లేక, కూర్చునే కునికిపాట్లతో తృప్తిచెందుతున్న నేను, త్రుళ్ళిపడి కళ్లువిప్పి చూచాను.

"దయచేసి ఇక్కడ కూర్చోనిస్తారా?" అని ఎదురుగా పాతికేళ్ళ యువకుడు, కళ్లల్లో జాలి దృక్కులు బరపుతూ, అడిగేసరికి నిద్రచెడగొట్టాడనే బాధ కనీసం ఛాయామాత్రంగానైనా నాలో పొటమరించలేదు. పైగా అతని లావణ్యం, చూపుల్లో సౌహార్ద్రత అతని అభ్యర్థనను నాచే తిరస్కరింపచేయకుండా చేసినై.

"కూర్చో" అని నా కాళ్ళు కొంచెం దగ్గరకు లాక్కుని కుంచించుకుని కూర్చున్నాను. ఆ అబ్బాయి ఉన్నంతలోనే వీలుజేసుకొని ఇరుక్కొని కూర్చున్నాడు. అతని అవస్థ చూచి నేను మరికొంత చోటిచ్చాను.

"ఏం స్టేషన్?"

"బెజవాడ."

"ఎందాకా వెళ్తున్నారు?"

"మద్రాసు."

"అబ్బా! చాలాదూరం వెళ్ళాలి; నేనూ అక్కడికే లెండి. వెధవ ట్రైను. చాలా లేటయి వచ్చింది. మద్రాసు చేరేటప్పటికి మధ్యాహ్నం ఏ రెండో మూడో అవుతుంది. మధ్యలో మళ్లీ ఏజబ్బూ చేయకుండావుంటే పదిగంటలు పడుతుందనుకుంటాను."

అవునన్నట్లు తల ఊపాడు ఆ అబ్బాయి.

నేను మళ్ళీ నిద్రపోదామని నడుం వాల్చాను. కాని, కాళ్ళు జాపుకోడానికి చోటులేకపోవడంచేత పట్టే పట్టే నిద్ర భంగమవడంచేత మొత్తంమీద నిద్రపోవాలని ఎంత ప్రయత్నించినా నిద్రపట్టలేదు. ఆ అబ్బాయి వంక చూస్తే అతనికీ నిద్రాదేవిక చాలాదూరమున్నట్లనిపించింది.

"చదువుకుంటున్నారా?"

"లేదండి. లాయర్ను ప్రాక్టీసు మొన్న మొన్ననే ప్రారంభించాను."

"నిజం? చాలా చిన్నగా అవుపిస్తున్నారు? మీవయస్సెంతా?"

"పాతికసంవత్సరాలు, ఈ తరంవాళ్ళల్లో నలభై, యాభై ఏళ్ళువచ్చినా, కొందరుపాతికేళ్ళ వాళ్ళలావుండటం, పాతికేళ్ళ వాళ్లు వెంట్రుకలు నెరిసిపోయి, నలుగురైదుగురు పిల్లల్ని కనేటప్పటికి, యాభై ఏళ్ల వాళ్ల మాదిరి అగుపించడం సహజంగానే ఉందిగదండీ!"

"అలాంటి ప్రత్యేకతలు మాలో ఏమీ అవుపించడంలేదే" ఒకటి రెండుక్షణాలు మౌనంగా ఉండిపోయాం ఇద్దరం. కాని నేను మాత్రం అతనివంక పరిశీలనగా చూస్తూ, నా అభిప్రాయం నిజమేనన్న భావాన్ని సమర్థించుకోవచ్చు ననుకున్నాను. "పెట్టే బేడా ఏమీ లేదేమిటి? మీసామాను ఎక్కడపెట్టారు?" అని నిశ్శబ్దాన్ని భగ్నంచేస్తూ అడిగాను.

"ప్రక్కనేఉన్న ఆడవాళ్ల పెట్టెలో పెట్టాను. ఇక్కడ ఇంత ఒత్తిడిగా ఉన్నప్పుడు, నిద్రపోవటానికి చోటుదొరకదన్నట్లుండటంవల్ల బెడ్డింగుమాత్రం ఎందుకులే అని అక్కడే పెట్టేశాను."

అతని నిస్సహాయస్థితి చూచేసరికి నాకు జాలివేసింది. నాస్థానంలో అతణ్ణి నిద్రపోవలసిందని ఆహ్వానించాను. కృతజ్ఞతాంజలి సమర్పిస్తూ, నా బెడ్డింగుపై నిద్రపోవటానికి అంగీకరించాడు. అమృతకలశమే హస్తగతమైనంత ఆనందపరవశుడయ్యాడు.

తరువాత కొంచెంసేపటికి నేను అతని ప్రక్కనే ఒదిగిపడుకున్నాను. ఎలాగో ఇద్దరం ఇరుకుగా ఫీలవుతున్నా సర్దుకోగలిగాం.

రైలు వేగంగా దూసుకుపోతుంటే, ఆ వేగానికి తట్టుకోలేక భయంతో వెనకదాక్కోజూచే గాలి, శరణంటూ మా దగ్గరకు రావడంవల్ల, ఆ గాలి జోలపాట జోరుకావడంతో నిద్రలో మునిగిపోయాం.

మరునాటి ఉదయం బిట్రగుంటలో బండి ఆగేసరికి నాకు నిద్రమెలుకువ వచ్చింది. లేచిచూస్తే, నాప్రక్కన పడుకున్న లాయరు అక్కడలేడు. ముఖం కడుక్కుందామని క్రిందకు దిగాను. ప్రక్కన లేడీస్ కంపార్టుమెంటుదగ్గర ఒకయువతితో లాయరుమాట్లాడుతూ ఉండటంచూచాను. ఎట్టి శరీరచ్ఛాయ! చెంపకు చారెడేసికళ్లు. సగం వికసించిన గులాబిరేకులవంటి సన్నటి పెదవులు; గుండ్రనిముఖం; రవికచాలని వక్షస్సౌందర్యం; సన్నని తెల్లని బియ్యపుగింజల్లాంటి పండ్లు; పసుపుపచ్చగానిగనిగలాడే బుగ్గలు; అపురూపసుందరి. పంపుదగ్గర నించుని ముఖం కడుగుతున్నంతసేపూ ఒకకన్ను అటుకేసి ఉంచాను. తర్వాతఆమెను చూడాలనిటీ తాగాలనే నెపంతో అటూఇటూ రెండుమూడుసార్లు తిరిగాను వెళ్తూ, వెళ్తూ. వాళ్లిద్దరూ మాట్లాడుకుంటున్న చోటుకు దగ్గరగా, వాళ్లు నన్ను చూడాలనీ, ఆలాయరు నన్ను పిలిచి, ఆమెను ఫలానా అని పరిచయంచేయాలన్న అభిలాషతో కొంచెం నెమ్మదిగా నడవసాగాను.

ఆమె ఎవరో? లాయరు నన్ను పిలిచి పరిచయంచేస్తే బాగుండు ననిపించింది కాని ఆమెతో సంభాషిస్తూ బయటిప్రపంచాన్నే మరచిపోయాడు.

ఆమె చాలా అందంగా ఉంది.

రాత్రంతా నిద్రలేకపోవడం మూలంగా కాబోలు కళ్ళు లోతుకుపోయి, మనిషి కొంచెం నీరసంగా కనిపిస్తోంది. కానీ కళ్ళు



మాత్రం సుందరంగా, అమావాస్యనాటి నీలాకాశంపై వేగుచుక్క లన్నట్లు కాంతివంతంగా ఉన్నాయి.

నా ఆశ అడియాస అయింది. లాయరు నన్ను పిలవలేదు. ఆమె ఎవరో నాకు పరిచయం చేయలేదు. బండి బయలుదేరే టైము అయింది. గార్డు విజిల్ వేశాడు. నేను తిరిగి కంపార్టుమెంటులోకి ఎక్కాను. కంపార్టుమెంటు దగ్గరకొచ్చి వేడి వేడి టీ అని అరుస్తూంటే, ఒక టీ తీసుకున్నాను. అంతలోకి లాయరు గబ గబా కంపార్టుమెంటులోకి వచ్చాడు. పరిగెత్తుకొచ్చాడల్లే ఉంది. రొప్పుతున్నాడు.

“టీ తీసుకుంటారా” అని అడిగాను ఆయన్ని.

“ఆ! తీసుకుంటా...థాంక్స్. కొద్దిగా చాలండి అబ్బ...ఎంతరద్దీగా ఉందండి బండంతా...”అని అలసట తీర్చుకుంటూ, చెమట తుడుచుకుంటూ అన్నాడాయన.

“అవును, చాలారద్దీగా వుంది...పాపం..” మీ...మీఆవిడగార్కి ఇబ్బందేం లేదుగదా” అని టీ అందిస్తూ అడిగాను.

“థాంక్స్,” అని టీ ఇచ్చినందుకు కృతజ్ఞత తెలిపాడు. మళ్లీ వెంటనే తెలివితెచ్చుకొని, “సారీ...ఆమె నాభార్యకాదు”, అని నాతప్పు వ్యాఖ్యానాన్ని ఖండించాడు.

“ఓ, సారీ...” అని తప్పుగా వ్యాఖ్యానించినందుకు ఫీలవుతూ టీ కప్పులోకి తొంగి చూచాను.

కాని నాలో ఆమె ఎవరో తెలుసుకోవాలన్న ఆత్రుత హెచ్చింది. ఆమె ఎవరో? ఆమెకు లాయరుకూ బంధుత్వం ఎలాంటిది? అసలు అతన్ని డైరెక్టుగా అడిగేద్దామనిపించింది. కాని సభ్యతకు విరుద్ధమనిపించుకుంటుందేమోనని సందేహించి ఊరుకున్నాను. అలా అడగడమే తటస్థిస్తే నేనెందుకు అంత ఆతృతగా ఉన్నానో అతడూహించగలుగుతాడు. ఆ అమ్మాయి రూపలావణ్యాలు నన్ను ముగ్ధుణ్ణి చేశాయి. అందులో ఏమాత్రం సందేహంలేదు.

ఆమె అతని భార్యకాదు, పోనీలే... అదోక శుభసూచన అనుకున్నాను. ఆశ నిర్జీవం కాకపోవడం శుభసూచన కాదూ మరి? ఆమెకూ అతనికీ బాంధవ్యమెట్టిదో తెలుసుకోడానికి అన్యమార్గం ఆలోచించాలి.



మే మిద్దరము ఇల్లు సమీపించగానే, గేటు దగ్గరాగి ఆయన నాతో అన్నాడు:

"చూడండి! నామట్టుకు నాకు మీరు మంచివారులా కనపడుతున్నారు. ఇంటిని మీరు జాగ్రత్తగా వాడుకుంటారన్న విషయంలో నాకేలాంటి సందేహంలేదు. అదే నాకు కావలిసింది. ఇల్లు, అద్దె మీకునచ్చిన పక్షంలో ఇప్పుడే తాళం తీసికోవచ్చును. అన్నీ కలుపుకుని అద్దె మూడువందలు. ఒక్క రూపాయికూడా తగ్గదు."

ఆయన్ను అనుసరించి లోపలికి వెళ్లాను. కొల్పిన పదినిమిషాల లోపుగానే వ్యవహారం పరిష్కారమై ఆయన నాచేతికి తాళమిచ్చి వెళ్లిపోయాడు. ఉద్యోగరీత్యా నేను చాలా ఊళ్ళలో చాలా ఇళ్ళలో గడిపానుకాని ఇంతసూటిగా, వ్యవహారపక్షంగా ప్రవర్తించిన ఇంటియజమాని నెక్కడా చూడలేదు. ఇంతకంటె మంచి ఇంటినికూడ చూడలేదు. అన్ని విధాలా నా అవసరాలకు తగినట్లుగా తీర్చిదిద్దబడింది. బహుశా నాకోసమే ఈఇల్లు కట్టబడిందేమో ననిపించింది! ఇంకొకటికూడా ఉంది — చాలా అరుదైన విషయం. ఈ గృహనిర్మాణంలో వాస్తుశాస్త్రానికి, ఆరోగ్యశాస్త్రానికి సమన్వయం సాధించబడింది. ముఖ్యంగా దక్షిణం వేపు ఉన్న చిన్న గది నన్నాకర్షించింది. ఆగదిని కేవలం ప్రత్యేకముగా నేను అట్టేపెట్టుకుందుకు నిశ్చయించుకున్నాను. చాలాకాలంనుంచి ప్రత్యేకముగా ఒకగది లేనికొరత నన్నుబాధిస్తూనే వుంది. తీరికసమయాల్లో ఏమైనా చదువుకోడానికి, వ్రాసుకోడానికి అది చాలా బాగుంటుంది. పోతే, దీని కెదురుగా మరొక గది వుంది. అన్నట్టు చెప్పడం మరిచాను. ఈగదిమాత్రం ఇంకా తాళంవెయ్యబడివుంది. ఇంతకుపూర్వం ఇక్కడ కాపురమున్నవాళ్లు ఇల్లు ఖాళీచేస్తూ, కారణాంతరంవల్ల కొంత సామాను ఈ గదిలో విడిచి వెళ్ళారు. ఈ విషయాన్ని ఇంటి యజమాని నాతో ప్రస్తావించాడు. ప్రస్తావిస్తూ నాతో ఆయన "మీకొక విషయం చెప్పాలి. నిజానికి ఈ ఇల్లు ఈవేళ ఉదయం పదిగంటలకు ఖాళీ అయింది. అయితే పాపం, వాళ్లు సామానంతటినీ ఒక్కమారు తీసుకువెళ్ళడానికి కుదరక, ఈ గదిలో కొంత దాచుకోడానికి నన్నడిగారు. ఒక్క వారం మించనిపక్షంలో సామాను విడిచివెళ్ళవచ్చునని అంగీకరించాను. నాకు అనేకపనులుండి, తీరిక కుదరదు. అందుచేత మళ్లీ పనిగట్టుకొని నేను రానవసరంలేకుండా, వీలువెంబడిని సామాను తీసుకుపోవడానికి అనుమతిస్తూ ఒకఉత్తరం వ్రాసి వాళ్లకిచ్చాను. ఉత్తరంగనుక మీకు చూపినట్లయితే, నిరభ్యంతరంగా వాళ్ళను సామాను తీసుకుపోనివ్వండి. నాకు వీలయినప్పుడు వచ్చి మీదగ్గర ఆ ఉత్తరం తీసుకుంటాను. తరవాత ఈగదినికూడా మీరు యథేచ్ఛగా వాడుకోవచ్చును" అన్నాడు. నాకు కూడా పెద్ద అభ్యంతరమేమీ లేకపోయింది. ప్రస్తుతం నేను ఒక్కణ్ణే. అదీగాక వారం రోజులేమంత పెద్దకాలంకాదు. అందుచేత "సరే" నన్నాను.

"చేతిగడియారంవంక చూశాను. నాలుగు దాటి పదినిమిషాలయింది. పోనీ ఒకటి చేదామనిపించింది. మొన్న కొత్తగా ఈ ఊరికి వచ్చినప్పుడు నేను ఒకమిత్రుని ఇంట్లో దిగాను. అక్కడికివెళ్లి నా సామాను తెచ్చుకున్నట్లయితే బాగుండు ననిపించింది. సామానంటే పెద్ద ఏమీలేదు—ఒకపెట్టె, బెడ్డింగు మాత్రమే. వెంటనే ఇంటికి తాళం వేసి రిక్షాలో బయలుదేరాను.

దారిలో నాకొక రమ్యమైన ఊహ కలిగింది. నేనుకూడ ఎప్పుడైనా ఒక ఇల్లంటూ కట్టగలిగితే, సరిగ్గా ఇప్పుడు అద్దెకు తీసుకొన్న ఇల్లువంటి ఒక చిన్న ఇల్లు కట్టాలనిపించింది. మళ్లీ వెంటనే నామటుకు నాకు నవ్వు వచ్చింది. నవ్వకుండా ఉండలేకపోయాను. నా అదృష్టానికి ఒక స్వంత ఇల్లుకూడానా! దాదాపు పదిహేనేళ్ళనుంచి ప్రభుత్వంవారి మత్స్యశాఖలో గుమస్తాగా పనిచేస్తున్నాను. నా సంపాదన బొటాబొటిగా తిండికిమాత్రం సరిపోతోంది. ఈ సంపాదనతో ఇల్లు మాటటుంచి, నేనింతవరకు రచించిన కావ్యాలను అచ్చు వేయించలేకపోయాను. అప్పుడప్పుడు పత్రికాముఖాన వెలువడిన నా కావ్యభాగాలు విమర్శకుల ప్రశంసల నందుకొని నాకు ఖ్యాతిని, సాహిత్యరంగంలో ఒక విధమైన స్థానాన్ని సంపాదించిపెట్టినమాట వాస్తవమే. అయితే

# అదృష్టం తప్పిన తలుపు

నా కృషిలో చాలాభాగం ధనాభావం కారణంగా అజ్ఞాతంగానే ఉండిపోయింది. కాలగమనంతోపాటు అముద్రిత గ్రంథాల సంఖ్య కూడా పెరుగుతూ వచ్చింది. ఈ గ్రంథాలను ప్రకటించడం సంగతి దేవుడెరుగును కాని, ముందు వీటిని చెదపురుగులబారినుంచి రక్షించడం నా తలకుమించిన పనిగా తయారైంది. నన్నెరిగిన పండితమిత్రులు కొందరు నేనీ గ్రంథాలను ఉపేక్షించినట్లయితే సరస్వతీపీఠానికి తీరని అపచారం చేసినవాడి నౌతానని హెచ్చరించారు. ఆ సహృదయులతో ఏకీభవించడంకన్న నేనేమి చెయ్యగలను? నా ఆర్థికస్థితి అలాంటిది. సరే ఇప్పుడా విషయమంతా ఎందుకు?

తీరా నేను వెళ్ళేసరికి ఇంట్లో నామిత్రుడు కృష్ణమూర్తి లేడు. కృష్ణమూర్తి తండ్రి వసారాలో ఏదో చదువుతూ కూర్చున్నాడు. ఆయనకు విషయం యావత్తూ చెప్పి సామాను తీసికొని బయలుదేరాను. నేను తిరిగి వచ్చేసరికి అయిదుదాటింది. ఏం చెయ్యడానికీ పాలుపోక అలాగే కొంతసేపు గడిపాను. ఈ వేళ ఆదివారం కాబట్టి సెలవు దినం. ఒక్కొక్కప్పుడు సెలవురోజుకూడా నాకు దుర్భరంగా ఉంటుంది. యాంత్రికంగా ప్రభుత్వకార్యాలయంలో పరిశ్రమించడానికి సంవత్సరాలు తరబడిగా అలవాటుపడిన నాకు అప్పుడప్పుడు స్వేచ్ఛలోని మాధుర్యం దూరమై తికమకపడుతూంటాను. ఈ విషయం తలుచుకొంటే నాకే ఆశ్చర్యం వేస్తుంది. ఏం చెయ్యడానికీ తోచక కాలుకాలిన పిల్లిలా అటూ ఇటూ తిరిగాను. చివరికి అలా పార్కుకు షికారువెడితే మనస్సుకు ఉల్లాసంగా ఉంటుందనిపించి ఇంటికి తాళం వేసి బయలుదేరాను.

మెల్లిగా నేను పార్కు చేరుకునేసరికి దాదాపు చీకటిపడింది. శీతాకాలపు చలిగాలికి వెరిచి అప్పుడే చాలామంది ఇళ్ళకు తిరిగి పోతున్నారు. వెళ్ళి ఒకమూల గడ్డిలో చతికిలపడ్డాను. ఎవరో రేడియోలో మన ప్రస్తుత ఆర్థిక పరిస్థితిని సమీక్ష చేస్తున్నారు. మెల్లిగా నడుం వాల్చి కళ్ళుమూసి పడుకొన్నాను. ఏమో, సమీక్ష వినపడుతోందే గాని ఒక ముక్కకూడా తలకెక్కలేదు. ఎప్పుడు నిద్రపోయానో నాకే తెలియదు.

తిరిగి నాకు తెలివి వచ్చేసరికి విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి. దట్టంగా అలుముకుంటూన్న చీకట్లను పారద్రోలలేక అవి నిస్సహాయంగా మినుకుమినుకుమంటున్నాయి. చలిగాలికూడ కొంచెం ముదిరింది. రేడియోలోనుంచి లలితసంగీతం ప్రసారమవుతోంది. చెవులురిక్కించి విన్నాను. అవును, నా గేయమే! అది నా గేయమే! కానినాకు ఒక్కసారిగా దుఃఖం పొర్లుకువచ్చింది. గాయకుని కంఠం శ్రావ్యంగానే ఉందిగాని భావాన్ని పూర్తిగా తగలపెట్టి మరీ పాడుతున్నాడు. ఒక్కసారిగా నాకు ఒళ్ళుమండింది. ఇంక ఉండలేక అక్కడనుంచి బయలుదేరాను. త్వరగా భోజనం చేసి ఇంటికిపోదామనిపించింది. సరాసరి పార్కునుంచి హోటలుకు వెళ్ళాను. అక్కడ భోజనశాలలో నాకొక పెద్దమనిషి తటస్థపడ్డాడు. నేను లోపలికి ప్రవేశిస్తూండగా నన్ను చూసి ఆయన గౌరవంగా "కవిరాజుకు నమస్కారం" అని అభివాదం చేశాడు. ఆయనకు ప్రతినమస్కారంచేసి టేబుల్ ముందు కూర్చున్నాను. మనిషిని పరీక్షగా చూశాను, కాని ఇంతకు పూర్వం ఎక్కడా కలిసినట్లు గుర్తుకు రాలేదు.

"క్షమించాలి. మిమ్మల్ని గుర్తుపట్టలేకుండా ఉన్నాను" అన్నాను నేను.

ఆయన చిరునవ్వు నవ్వుతూ "నేను మీ అభిమానుల్లో ఒకణ్ణి. ఒకటి రెండుసార్లు మీ ఉపన్యాసాలను వినే అదృష్టం కలిగింది. ఈ వేళ మీ పరిచయభాగ్యంకూడా కలిగింది నాకు" అన్నాడు.

"ఎంతమాట! మిమ్మల్ని కలుసుకున్నందుకు చాల ఆనందంగా ఉంది" అన్నాను.

వడ్డన పూర్తయి నేను భోజనానికి ఉపక్రమించేసరికి ఆయన తినడం ముగించాడు. కాని నాతో కబుర్లుచెపుతూ కూర్చున్నాడు. క్రమంగా పరిచయమై, ఇద్దరము సాహిత్యమీమాంస మొదలుపెట్టాం. భోజనశాలలో ఆ సమయంలో వేరెవ్వరూ లేకపోవడం వల్ల నిరాఘాటంగా మాట్లాడుకో గలిగాము. మా ఇద్దరి దృక్పథాలు దాదాపు ఒక్కటే కావడంవల్ల మా చర్చలు తీవ్రతరం కాలేదు. ఇంతలో నా భోజనం పూర్తి అయింది.

మొదటివ్యక్తి—మీకు పిల్లలు ఎందరండీ?

రెం. వ్యక్తి—రాముడు, గోపీ, సుశీల, రంగడు...

మొ. వ్యక్తి—పేర్లు అనవసరం, సంఖ్య చెబితే చాలు.

రెం. వ్యక్తి—పేర్లు చెబితే సంఖ్య తెలియదా?

—కోయల్‌కర్ బన్సీలాల్
(నిజామాబాద్)

ఆయనవద్ద సెలవుతీసుకొని ఇంటికి బయలుదేరాను.

తాళంతీసి గదిలో ప్రవేశించాను. చీకటిలో ఎలక్ట్రిక్ స్విచ్ ఎక్కడుందో ముందు బోధపడిందికాదు. అగ్గిపుల్ల వెలిగించి దీపం వేశాను. తలుపు గడియవేసి, బెడ్డింగు పరిచి మెల్లిగా నడుంవాల్చాను. చాలా బడలికగా ఉన్నానేమో ప్రాణం లేచివచ్చినట్లయింది. లేచివెళ్ళి దీపం ఆర్పడానికికూడా ఓపిక లేకపోయింది. చేతిగడియారం విప్పి తలగడక్రింద పెట్టాను. 9-20 అయింది. అలాగే పడుకుని కళ్ళుమూశాను. క్రమంగా కనురెప్పలు బరువెక్కనారంభించాయి.

ఇంతలో తలుపుమీద ఎవరో తట్టినట్లయింది. కళ్ళు తెరచి చూశాను. ఒకక్షణం ఆగి మళ్ళీ తలుపు చప్పుడైంది. బద్ధకంగా లేచివెళ్ళి తలుపుతీశాలు. ఎదురుగా ఎవరో పెద్దమనిషి నిలబడిఉన్నాడు. ఆజానుబాహువు. విలువైన దుస్తులు ధరించాడు.

"ఎవరుమీరు? ఏం కావాలి?" అనడిగాను. కాని ఆయన మాట్లాడలేదు. ఏదో సందేహిస్తున్నట్లు నిలబడ్డాడు. తిరిగి నేను ప్రశ్న వేశాను. ప్రత్యుత్తరంగా ఆయన చిరునవ్వు నవ్వాడు! ఒక్కక్షణం ఆగి "మీకు నిద్రాభంగం కాలేదుగదా" అని నన్ను ప్రశ్నించాడు. ఏమని చెప్పాలో నాకు తెలిసిందికాదు. ఆ చిరునవ్వు చూస్తుంటే నన్నెరిగినవాడిలా కనిపించాడు. ఆలోచనాపూర్వకంగా అలాగే చూస్తూ నిలబడ్డాను. చివరికి ఆయనే నన్ను "కవిరాజుకు నమస్కారం" అన్నాడు. నమస్కారం చేసినప్పుడు ఆయన వ్రేలిఉంగరాలు విద్యుద్దీపకాంతిలో తళుక్కుమని మెరిశాయి.

"నమస్కారం. మనం ఎక్కడ కలుసుకున్నామో గుర్తుకురాకుండా ఉంది" అన్నాను.

"ఇదే ప్రథమంగా మనం కలుసుకోవడం. మాది భారతీ పుస్తక ప్రచురణసంస్థ లెండి" అన్నాడాయన.

"అలాగా! లోపలికిరండి. పాపం అలాగే నిలబడ్డారు" అని ఆహ్వానించాను. ఆహ్వానించానేగాని ఆయనకు వెయ్యడానికి చిన్న కుర్చీ కూడ లేకపోయింది. "మన్నించాలి. మీకు సరియైన ఆసనంకూడా లేదిక్కడ. ఈ వేళ సాయంత్రమే ఈ ఇంట్లో దిగాను. ప్రస్తుతం ఈ పెట్టె, బెడ్డింగే నా ఆస్తి" అన్నాను క్షమాపణ పూర్వకంగా.

"అబ్బే మీ రనవసరంగా బాధపడకండి. వేళకాని వేళలో వచ్చి నేనే మీకు ఇబ్బంది కలుగచేశాను" అన్నాడాయన గదిని నలువంకలా కలియచూస్తూ.

"నాకు వచ్చిన ఇబ్బందేమీ లేదు లెండి; పోనీ అలా పెట్టెమీద కూర్చోండి" అన్నాను.

అందుకాయనకు నవ్వొచ్చింది. "ఇంతకూ

నేను వచ్చిన పని చెప్పడం మరిచాను. చాలా కాలంనుంచి మిమ్మల్లను కలుసుకోవాలనుకుంటున్నాను. ఇన్నాళ్ళకు కుదిరింది. ఈ ఇంట్లో మీరు అద్దెకు దిగారని ఇంతకు పూర్వమే నాకు తెలిసింది. అందుచేత ఇలా వచ్చాను" అన్నాడాయన.

"చాలా ఆనందంగా ఉంది నాకు" అన్నాను.

"ఇంతకీ అసలు విషయం చెప్పలేదు మీకు. ప్రచురణరంగంలో ఒక పెద్ద విప్లవం తీసుకురావాలని నా సంకల్పం. ఇందు నిమిత్తం ఒక ప్రణాళికను కూడ రూపొందించాను లెండి. వివిధ సాహిత్య శాఖల లోనూ ప్రసిద్ధులైన వారి గ్రంథాలను చౌకగా, సర్వాంగసుందరంగా ప్రకటించాలని నిర్ణయించాను. ముందుగా మీ కావ్యాలను అచ్చు వెయ్యాలని నా అభిమతం. అందువల్ల మా సంస్థకు పేరు ప్రతిష్ఠలు కలుగుతై. మీ కభ్యంతరం లేకపోతే..." ఆయన హఠాత్తుగా ఆగి నేనేమంటానో అని నా వైపు చూశాడు.

అభ్యంతరమా! నాకా! నాకా! మనస్సులో ఎగిరి గంతువేశాను. ఆనందంలో గొంతు ముడివడి నాకు మాట పెగలడమే కష్టమైంది.

"మీరు దీనికి అంగీకరిస్తారనే అనుకుంటాను" అన్నాడాయన మళ్ళీ.

"తప్పకుండా అలాగే చేద్దాం. పోనీ అలా కుర్చీమీదైనా కూర్చోండి తీరికగా మాట్లాడుకోవచ్చును. పాపం నిలబడే ఉన్నారు" అన్నాను.

"చాలు. మీ ఆమోదం పొందగలిగాను. ఇంతకన్నా నాకు కావలసిందేమీ లేదు. పోతే మిగతా వివరాలు మనం మరోమారు సావకాశంగా మాట్లాడుకోవచ్చును. ఈ స్వల్పవిషయానికి ఇంత రాత్రివేళ వచ్చి మీకు నిద్రాభంగం చేశాను. క్షమించండి. మరి నాకు సెలవా" అన్నాడాయన బయల్దేరడానికి ఉద్యమిస్తూ.

"మీరు వచ్చినందుకు చాల సంతోషంగా ఉంది. మీ రాకవల్ల నాకు శ్రమ కలిగిందని అనవసరంగా బాధపడకండి. ఒకవిధంగా చూస్తే, నేనే మీకు శ్రమ కల్గించాను" అన్నాను.

"అబ్బే. అటువంటిదేమీ లేదు. మరి వస్తాను. నమస్కారం" అన్నాడాయన.

"నమస్కారం.మరి ఉంటాను" అన్నాను నేను. గేటువరకు ఆయన్ను సాగనంపివచ్చి, తలుపువేసి పడుకున్నాను. ఆనందంతో మనస్సు ఉరకలువేసి నాగుండె బరువెక్కింది. నాకు అమితానందం కలిగితే ఉక్కిరిబిక్కిరై దాదాపు ఏడ్చినంత కన్నీరు కారుతుంది. ఆనందబాష్పాలతో నా తలగడ తడిసిపోయింది. ఇలా జరుగుతుందని నేను కలలోకూడ అనుకోలేదు. ప్రసిద్ధి చెందిన ఒక ప్రచురణసంస్థ అధిపతి తనకు తానై హఠాత్తుగా నావద్దకు వస్తాడని నేను ఊహించలేకపోయాను. అప్రయత్నంగా ఇన్నాళ్ళకు నా కావ్యాలకు ముక్తి కలగబోతోంది నాకనిపించింది. అదృష్టం ఇలాగే వస్తుంది గాబోలు. ఏ వేళలో నైనా అది రావచ్చు. అదృష్టానికి పగలేమిటి, రాత్రేమిటి? సంధ్యాసమయంలో కూడ వచ్చి తలుపు తడుతుంది. మనం చెయ్యవలసినదల్లా, అదృష్టం తట్టినప్పుడు, పరాకు లేకుండా విని తలుపు తీయడమే. అంతే.

మళ్ళీ ఇంతలోనే తలుపు చప్పుడైనట్లయినది. పరాకులేకుండా విన్నాను. నిజమే. ఎవరో తలుపు తడుతున్నారు. కుతూహలంగా లేచివెళ్ళి తలుపుతీశాను. ఒకపొట్టిమనిషి, బట్టతలాయన నిలబడివున్నాడు. అడుగుముందుకు వేయబోయి నన్ను చూసి సంబాళించుకున్నాడు. ఇంతకుపూర్వం అవ్యక్తిని ఎక్కడో చూసినట్లు హఠాత్తుగా నాకు స్ఫురించింది. ఆ గుండ్రని బట్టతల, విలక్షణమైన ముక్కు పరిచితమైనవిగా కనిపించాయి. కాని ఆయన ఫలానా అనిమాత్రం నిశ్చయం కలగలేదు.

"నమస్కారం కవిగారికి" అన్నాడాయన మందహాసం చేస్తూ.

"నమస్కారం. ఇలా దయచేయండి" అన్నాను ఇంకా ఆలోచిస్తూనే. ఆయన గదిలోకి వచ్చి చుట్టూ కలయచూశాడు. ఒక్క క్షణం ఆగి "మీరేవో ఆలోచిస్తున్నారు. బహుశా ఈ మిత్రుణ్ణి మరిచిపోయారనుకుంటాను" అన్నాడు.

"ఎంతమాట! మీకు సరియైన ఆసనం ఇక్కడ లేదుకదా అని చింతిస్తున్నాను. మీరు క్షేమమే కదా?" అని అడిగాను.

"మీ దయవల్ల క్షేమంగానే ఉన్నాను. మీరు గౌరవించవలసినంతటివాడినా నేను? మీదయవుంటే అంతే చాలు" అన్నాడాయన.

ఆయనవైఖరి చూస్తే ఏదో ముఖ్యవిషయం చెప్పడానికి వచ్చినట్లు కనిపించింది. అవ్యక్తి ఎవరా అని నా మెదడు తీవ్రంగా పని చేస్తోంది. కాని లాభం లేకపోయింది. నాకొక్కటే ఉపాయం తోచింది. సంభాషణాచాతుర్యం వల్లగాని ఈ సమస్య తేలదనిపించింది.

"పాపం చాలా పొద్దుపోయివచ్చారు. నావల్ల మీకేమయినా..." నేనింకా పూర్తి చెయ్యకముందే ఆయ నందుకున్నాడు.

"అవునండి చాల ఆలస్యమైంది. అందుకే నేను బాధపడుతున్నాను. కాని పనితొందరవల్ల ఈసమయంలో రాకతప్పిందికాదు" అన్నాడు. ఒక్కక్షణమాగి మళ్ళీ ప్రారంభించాడు. "మీకు కొంచెం శ్రమకలుగజేస్తున్నాను. త్వరలోనే మాసంఘం వార్షికోత్సవాలు జరగబోతున్నాయి. ఆసందర్భంలో జరగబోయే సభలకు మంచి ఉపన్యాసముల్ని

ర్వహించదలచాం. అదృష్టవశాత్తూ మీ రిక్కడున్నారని తెలిసింది. నేను ముఖ్యంగా కోరేదేమంటే మీరు తప్పకుండా మీ ఉపన్యాసం వినేభాగ్యం మాకు కలుగజెయ్యాలి. అన్నట్టు, మన విద్యామంత్రి గారి చేత ఈ సభలను ప్రారంభింపజెయ్యడానికి గట్టిగా ప్రయత్నాలు చేస్తున్నాం. దీనికి మీరు కాదనరని భావిస్తాను" అన్నాడాయన.

## అదృష్టం తప్పిన తలంపు

"దానికేముంది. అలాగే చేద్దాం. ఈమాత్రానికి పాపం మీరింతగా చెప్పాలా" అన్నాను.

"చాల సంతోషమండి. ఈవార్షికోత్సవాలను ఏర్పాటుచేసే సంరంభంలో నాకు క్షణం ఊపిరి చిక్కడంలేదు. వేళకాని వేళలోవచ్చి మీకు శ్రమకలుగచేశాను. క్షమించండి. అన్ని ఏర్పాట్లు పూర్తికాగానే మీకు కార్యక్రమాన్ని తెలియజేస్తాను. వస్తానుమరి. దయఉంచండి."

నమస్కారంచేసి ఆయన వెళ్లిపోయాడు.

నేను తలుపు గడియవేసివచ్చి పడుకొన్నా ఆలోచించాను. మెదడు క్రమంగా వేడెక్కిందికాని ఆ బట్టతల పెద్దమనిషి ఎవరో ఖచ్చితంగా తెలియరాలేదు. ఈయన ఏ సంఘానికి చెందినవాడో? విద్యామంత్రి ప్రారంభోత్సవానికి రాబోతున్నాడంటే మంచి ప్రతిష్ఠగల సంఘం అయివుండాలి. దానికి ఈయన అధ్యక్షుడో, కార్యదర్శో అయిఉంటాడు. పోనీలే ఈ విషయం క్రమంగా తెలియకపోదని సరిపుచ్చుకొని కళ్లుమూశాను. కాని నిద్రపట్టలేదు. ఒకవిధంగా చూస్తే విద్యామంత్రిని కలుసుకునే అవకాశం కలిగింది. అందుకు సంతోషం. ఇంకొక విధంగా ఈ అవకాశాన్ని కలుగజేసిన వ్యక్తి ఎవరో స్పష్టంగా తెలియకపోవడంవల్ల మనస్సు పరిపరి విధాలుగా పోయింది. అలాగే కళ్లు మూసుకున్నాను. ఉన్నట్టుండి తలుపు మళ్లీ చప్పుడైంది. నాకు చిత్రంగా తోచింది. ఈసారి ఎవరు వచ్చివుంటారోనని కుతూహలం కలిగింది. వెళ్ళి తలుపు తీశాను. నా కళ్లను నేనే నమ్మలేకపోయాను. ఎదురుగా సుందరం! పూర్తిగా పోలీసు ఇన్స్పెక్టర్ యూనిఫారంలో ఉన్నాడు.

"ఓహో! బహుకాలానికి రావడం! వస్తూ వస్తూ ఇదేమిటోయ్ ఈ వేషం! మిత్రుణ్ణి చూడడానికి అధికారహోదాలో వచ్చావా?" అని అడిగాను అతన్ని కౌగలించుకుంటూ. సుందరం కుశలమడిగి, నవ్వాడు. గుమ్మంవద్ద సందేహిస్తూ నిలబడ్డాడు. అతని సందేహం నాకర్థమైంది. "ఫరవాలేదులే. బూట్లతో లోపలికి రావచ్చును" అని చేతితో గదిలోకి లాగాను. హెల్మెట్ తీసి కిందపెట్టి, పెట్టెమీద కూర్చుని సుందరం సిగరెట్ వెలిగించాడు. నేను బెడ్డింగ్ మీద చతికిలబడ్డాను. ఇద్దరం ఒకర్ని చూసి మరొకరు నవ్వుకున్నాం.

"బాగా చిక్కిపోయావే నువ్వు" అన్నాడు సుందరం ఘాటుగా పొగపీలుస్తూ.

"అది సరేకాని, నేనిక్కడే ఉన్నానని ఎలా తెలిసింది సుందరం?" అని అడిగాను.

"ఎలాగో ఒకలా తెలిసింది. తెలీగానే ఇలా రెక్కలు కట్టుకుని వచ్చి వాలాను"— నవ్వుతూ అన్నాడు.

"అవునులే. నువ్వు పోలీస్ ఆఫీసరువికదా! నీకన్ని విషయాలు తెలుస్తాయి" అన్నాను. సుందరం ఇచ్చిన సిగరెట్ వెలిగించి గోడకు చేరబడ్డాను. ఇద్దరం ధూమపానం చేస్తూ చిన్ననాటి విషయాలు, ప్రస్తుత సాంఘిక బాధ్యతలూ అవీ మాట్లాడుకుంటూ కూర్చున్నాం.

నేనూ సుందరం బాల్యస్నేహితులం. చిన్నతనంలోనూ అటుతరువాత విద్యార్థి దశలోనూ ఇద్దరం విడనిజంటగా కాలం గడిపాము. మా చదువులు పూర్తికాగానే జీవితంలో చేరి ఒక మార్గం పట్టాము. వాడు పోలీసు శాఖలోనూ, నేను మత్స్య శాఖలోనూ ప్రవేశించాం. ఉద్యోగాలలో సెటిలపడినప్పటినుంచీ ఎప్పుడో హఠాత్తుగా కలిసుకోవడం తప్పితే మా ఇద్దరిమధ్యా క్రమమయిన రాకపోకలు లేవు. ఈ వేళకూడా మా కలయిక అనుకోకుండానే జరిగింది. ఏదో కేసు సందర్భంలో సుందరం మొన్న ఈవూరు వచ్చాడుట. ఈ రాత్రే ఒంటిగంట బండికి వెళ్లిపోతున్నాడు. అదృష్టవశాత్తూ ఇలా చిత్రంగా కలిశాం.

మా కబుర్లు పూర్తయేసరికి ఒక నిండు సిగరెట్ పెట్టె ఖాళీ అయింది. సుందరం తన చేతిగడియారంవంక చూసి వెళ్లడానికి లేచాడు. "వస్తాను మరి. రైలుకు టైమవుతోంది. నాకు చాలా సంతోషంగా ఉందిరా. ఈ వేళ నిన్నిక్కడ కలుసుకుంటాననుకోలేదు" అన్నాడు. నేను నవ్వాను. "ఇంకా నాకీ ఊళ్లో పని పూర్తికాలేదు. మళ్ళీ రెండుమూడు వారాల్లో ఒకసారి వస్తాను. అప్పుడు పూర్తిగా ఒక రోజు నీతో గడుపుతాను" అన్నాడు సుందరం బయటకు నడుస్తూ.

"ఈ మారు వచ్చినప్పుడు ఇలా మెరుపులా కనబడి వెళ్లిపోతానంటే ఊరుకోను. తాళ్లతో కట్టిపడేస్తాను. జాగ్రత్త" అన్నాను వాణ్ణి సాగనంపుతూ. సుందరం గట్టిగా నవ్వి, ఒక క్షణమాగి రోడ్డుమీదకి నడిచాడు. వాడు సందుమలుపు తిరిగేవరకూ అలాగే చూస్తూ నిలబడ్డాను.

నాకీ రాత్రి చాలా విచిత్రంగా తోచింది. అనుకోకుండా మూడు ఆనందదాయకమైన సంఘటనలు జరిగాయి. వాటిని గురించి ఆలోచిస్తూ నాలో నేను నవ్వుకున్నాను. బెడ్డింగ్ మీద దుప్పటితీసి దులిపి పరచాను. దీపమార్పి, తలుపు వేద్దామనుకుంటూఉండగా వెనక అడుగుల చప్పుడైంది. అటు తిరిగాను. నా గుండె ఝల్లుమంది. ఎవరో వ్యక్తి గుమ్మందగ్గర నిలబడ్డాడు. అతి ప్రయత్నంమీద కంగారు అణచుకోగలిగాను.

"ఎవరు? మీకేం కావాలి? అని గంభీరంగా అడిగాను.

"రాజుగారి ఇల్లెక్కడండీ?" అని ప్రశ్నించాడతడు.

"ఏమో, నాకు తెలీదు."

"ఈ ప్రాంతంలోనే వుంటున్నారాండి?" అన్నాడతడు మళ్లీ.

"అయ్యా! ఈ రోజే నేనీ ఇంట్లో దిగాను. నాకీ ఊరే కొత్త" అన్నాను నేను. అతనొక క్షణకాలం తటపటాయించి తరవాత వెళ్లిపోయాడు. "నీ రాజుగారు బంగారంకానూ, అనవసరంగా కంగారుపెట్టించావు గదయ్యా మహానుభావా!" అనుకున్నాను. తలుపు గడియవేసి, దీపమార్పి వచ్చి పడుకున్నాను. ఒక క్షణానికికాని గుండె దడ తగ్గలేదు. దడ తగ్గేసరికి తిరిగి బట్టతలమనిషి,

భారతీ ప్రచురణసంస్థను గురించిన ఆలోచనలు మెదడులో రేకెత్తాయి. ఈ ఆలోచనలతోను, మిత్ర సందర్శనంవల్ల కలిగిన ఉత్సాహంతోనూ నాకు నిద్రపట్టలేదు. చాలాసేపు అలాగే ఆలోచిస్తూ గడిపాను. చివరికి ప్రాణం అలిసి ఎప్పుడు కన్ను మూశానో నాకు తెలీదు.

## అదృష్టం తప్పిన తలంపు

తిరిగి నాకు తెలివివచ్చేసరికి తలుపు చప్పుడవుతోంది. బహుశా ఆ తలుపుచప్పుడుకే నాకు తెలివివచ్చినట్లుంది: బద్ధకంగా కళ్ళు తెరచాను. ప్రాతఃకాలపు వెలుగు గదిలోకి ప్రవహిస్తోంది. అట్టేసేపు నేను విశ్రమించినట్లు లేదు; నాకళ్ళు మండుతున్నాయి. లేచి వెళ్ళి తలుపు తీశాను. ఒక్కసారి చలిగాలి సోకి శరీరం పులకించింది. వీధిలో గేటు దగ్గర గుర్రంబండి ఒకటి ఆగిఉంది. ఎదురుగా వసారాలో ఒక స్త్రీ నిలబడి ఉంది. ఏ మహిళామండలి సభ్యురాలో, కార్య



*

దర్శినో ఐఉండాలనిపించింది నాకు. ఇంత తెల్లవారుఝామునే నాతో ఆమె కేమిపనా అని ఆశ్చర్యం కలిగింది.

"ఎవరండీ మీరు? ఏంకావాలి?" అని ప్రశ్నించాను. ఆమె మాట్లాడలేదు. సమాధానంగా చేతిలో ఉన్న కాగితాన్ని నాకందించి తలవంచుకుంది. కాగితంతీసి పరీక్షగా చూశాను. ఇంటి యజమాని వ్రాసిన ఉత్తరం అది.

"ఓహో! మీ రేనన్నమాట నిన్న ఇల్లు ఖాళీచేసింది. సామాను తీసికెళ్లడానికి వచ్చారా?" అని ప్రశ్నించాను. ఔనన్నట్లు ఆమె తల ఊపింది. తల ఊపినప్పుడు రెండు మూడు కన్నీటిబొట్లు గచ్చుమీద పడ్డాయి. అరె! ఆమె ఏడుస్తూందా? నాకిదేమీ అర్థం కాక తెల్లబోయాను. చివరికి ఆమెతో "మాడండీ, మీకు వచ్చిన కష్టంఏమిటో ఎరగను. ఒకవేళ మీరు గదిని ప్రస్తుతం ఖాళీ చెయ్యలేనిపక్షంలో మీ సామాను ఇక్కడే దాచుకోండి. నాకు వచ్చిన ఇబ్బందేమీ లేదు. వారంకాదుకదా, నెల్లాళ్లయినా నాకు ఫర్వాలేదు" అన్నాను. చీరకొంగుతో తనకళ్లు తుడుచుకొని తల పైకెత్తి మాసింది. "మీరు చూపిన దయకు చాల కృతజ్ఞురాల్ని. కాని సామాను తీసికొని ఇప్పుడే వెళ్ళిపోతాను. నాకోసం స్టేషనులో మా చెల్లెలు చూస్తూంటుంది. నేనిక్కడ ఒక్క క్షణంకూడా ఆగడానికి వీల్లేదు" అన్నదామె.

చూస్తూండగానే ఆమెలో ఏదో వెర్రి ఆవేశంవచ్చి ముఖ కవళికలు మారిపోయాయి, బరువుగా నిట్టూర్చింది. "అవును. వెళ్ళిపోవాలి. నేను, చెల్లికూడ వెళ్లిపోవాలి. దూరంగా, దూరంగా, ఇంకా ఇంకా దూరంగా. ఎవరికీ తెలియని దూరాలకు వెళ్లిపోవాలి" అంది.

ఆ మాటలకు ఆమె చూపులకు అర్థంతేగు. కొంపతీసి ఆమె పిచ్చిదికాదుకదా అనిపించింది. ఏదో కొంప మునిగిపోయేటట్టు చీకటితోనే వచ్చిపడింది.

"ఎందుకు అంతదూరం? ఏం నేరం చేశారని వెళ్ళిపోవాలి?" ఉచ్చారణలో హేళన స్ఫురించకుండా అడిగాను. ఆమె నవ్వింది నిర్లక్ష్యంగా. మళ్ళి అంతలోనే ఆమెముఖం తీవ్రమయింది. "ఒక్కటే నేరం చేశాను. పరిస్థితులకు లొంగిపోయి నేనూ, మా చెల్లి ఆ వృత్తిలో ప్రవేశించాం. వెలుగులో నుంచి చీకటిలోకి దిగబడినట్లే అయింది మాకు. బ్రతుకే హీనమయి శూన్యమయింది. ఆ ఊబిలోనుంచి బయటపడాలని ఎంతగా ప్రయత్నం చేశాం! ఇన్నాళ్లకు కుదిరింది. ఎవరికీ తెలియని ఎక్కడికో పోయి వెలుగులో జీవించాలని ఉంది. తెలిసిన ఈ ఊళ్ళో ఈ మనుష్యులమధ్య జీవితాన్ని పునః ప్రారంభించలేం కదా" అన్నదామె కన్నీరు తుడుచుకుంటూ.

నామీద పిడుగుపడినట్లయింది. మతిభ్రమించింది. కళ్లు చీకట్లు కమ్మాయి. ఎప్పుడామె

ఒకరు—మీ ఊళ్ళో పేరుగల పెద్దమనుషులు ఎవరైనా పుట్టారా?

మరొకడు—లేదండి. మా ఊళ్ళో పుట్టినవాళ్ళందరూ పేరులేని చిన్నపిల్లలే.

—బద్దూరి (నిజామాబాద్)

కదిలివెళ్ళిందో, ఎప్పుడు గది ఖాళీ చేసిందో నేను గమనించలేకపోయాను. సామాను బండిలో వేయడం పూర్తయింది కాబోలు ఆమె తిరిగివచ్చి "వెళ్లిపోతున్నానండి, బహుశా వేళకాని వేళలో వచ్చిపోయే మనుష్యులతో రాత్రి మీకు సరిగా నిద్రపట్టి ఉండదు. దానికితోడు చీకటితోనే వచ్చి మీ నిద్ర పాడుచేశాను. క్షమించండి" అంది. నేనేమీ మాట్లాడలేకపోయాను. అలాగే చూస్తూ నిలబడ్డాను. ఒక్క క్షణం నిలబడి ఆమె నమస్కారంచేసివెళ్ళి బండిలో కూర్చుంది. నేనింకా అలాగే చూస్తూ నిలబడ్డాను. చూస్తూండగానే బండి నెమ్మదిగా కదిలి వెళ్ళిపోయింది. ★



# వనితాలోకం

## సీతమ్మ కథ - నా కథ

పేరులోన నేమి పెన్నిధి గలదన్న వారిమాట నిజమే అయినా—సగం పేరులోనే ఉందనేది అబద్ధం కాదు. ఆయా విషయాల్ని అవును కాదు అనకుండా కొన్ని ఇతరవిషయాలను ఇక్కడ రచయిత్రి పేర్కొంటారు.

ఒకటవ తరగతి చదువుకునే రోజుల్లోనే ఒక కథ వింటూ ఉంటాము. ఒక ఈగ పాపం, ఇల్లు అలుక్కునే రంధిలో పడిపోయి తన పేరే తాను మరిచిపోయింది. ఇలా ఎవరి పేరు వారు మర్చిపోయేవాళ్లు ఉంటారా అని మీరు అడక్కండి. మన ప్రస్తుత విషయం అది కాదు. ఇక తన పేరు మళ్లా తెలుసుకోవటానికి ఆ ఈగ తల్లి ఎంత అవస్థపడ్డదో, ఎందరి కాళ్లూ, గడ్డాలూ పుచ్చుకున్నదో మనందరికీ తెలిసిన విషయమే. ఆఖరుకు ఆ ఈగ నామ రహస్యం గుఱ్ఱం కడుపులో ఉన్న చిన్న గుఱ్ఱంపిల్ల ద్వారా తెలుసుకుని అప్పటికి మనసు కుదుటపడగా ఆ మిగతా ఇల్లు అలుక్కోవడానికి వెళ్లిపోయింది ఈగ తల్లి.

పేరు ఎవరికి ఉండదు? పుట్టి భూమ్మీద పడుతూనే ఓ పేరు సంపాదించుకుంటాడు మానవుడు. వెంకమ్మ, సుబ్బమ్మ, పుల్లమ్మ-ఇటువంటి పేర్లు వెనకటితరంలోవారివి. ఈ నాటి ఆడపిల్లలు స్వర్ణకుమారి, కమల, విమల, హైమ ఇటువంటి నాజూకైన ఒకటి రెండక్షరాల పేర్లు సంపాదించుకుంటున్నారు. అలాగే వెనకటి అంజయ్య, రంగన్న, పాపయ్యలు - సురేష్, మోహన్, ఆనంద్-లుగా వెలిశారు.

ఈమధ్య ఎక్కడో చదివాను - వెనకటికి మన దేశం బ్రిటిష్‌వారి పరిపాలనలో ఉండగా ఇక్కడ అధికారి హోదాలో కొన్ని సంవత్సరాలపాటు ఉండి వెళ్ళిన దొర ఒకాయన ఇలా అన్నాడట. 'ఆంధ్రప్రాంతంలో మీకు ఎవరితోనయినా మాట్లాడవలసివచ్చి అతని పేరు తెలియకపోయినా, మర్చిపోయినా, 'సూర్యనారాయణ' అనో, వెంకటేశ్వర్లు అనో పిలవండి. టక్కున రైటైపోతుంటుంది' అని. ఇలా మన ముక్కోటి దేవతలూ, నామమాత్రంగానైతేనేమి - ప్రతి యింటా మనకు దర్శనమిస్తుంటారు.

ఎన్ని పేర్లతో పిలిచినా, భగవంతుడొక్కడే అనేది నిర్వివాదాంశం. ఒక్కొక్క మతానికి ఒక్కొక్క దైవనామం ఉన్నట్లు హిందూమతంలోనే భగవంతునికి ఎన్నో పేర్లు ఉన్నవి. రామభద్రుడనీ, కృష్ణమూర్తి అనీ, వెంకటేశ్వరస్వామి అనీ - ఇలా ఎన్నో ఇష్టనామాలతో భగవంతుని పిలుచుకుంటూ ఉంటారు తెలుగువారు. ఎవరు ఏ నామంతో పిలిచినా వారిని ఆ రూపంతో, ఆ నామంతో అనుగ్రహిస్తాడని భగవంతుడికి ప్రతీతి ఉంది.

### వేదవతీదేవి

ఇలా భగవన్నామ రూపంలో అయితేనేమి, నిత్యజీవిత వ్యావహారికావసరాలకైతేనేమి - ఏదో ఒక పేరు ఉచ్చరిస్తూ ఉండటం మన అందరకూ పరిపాటే. కాని ఆశ్చర్యమేమంటే - ఇలా సర్వసామాన్యంగా వ్యావహారికంగా ఉచ్చరించబడుతున్న నామధేయం ప్రతి వ్యక్తి జీవితంలోనూ ఏదో ఒకరోజున గిలిగింతలు పెట్టి నవ్వించి - హృదయాల్ని పులకింపజేసే సమయం వస్తుంది.

అది - రెండు జీవితాల్ని, చెరి ఒక వేపు నుండి త్రోసుకు వచ్చిన రెండు మేఘ శకలాలవంటి జీవితాల్ని - ఒకటిగా ముడివేయబోయే కల్యాణ సమయం. ఆ సమయంలో మనవాళ్ళు చేసే సరదాలకు, వేడుకలకు అంతు ఉండదు. అలాటి వేడుకల్లో చూడవచ్చిన పేరంటాండ్రు మంగళసూత్ర ధారణ కన్నా ఎక్కువ ఆసక్తిగా ఎదురు చూసేది 'పేర్లు చెప్పించట' మనే తంతు. ఈ తంతు పూర్తిగా ఆడవాళ్ల హక్కు. వివాహానంతరం పసుపు బట్టలతో, చిటికెన వేలి లంకెతో వరుడూ, వధువూ, గుమ్మంముందు నిలువబడి ఉంటారు. అమ్మాయిచీరె కొంగూ అబ్బాయి ఉత్తరీయపు కొంగూ కలిపి పురోహితులవారు వేసిన బ్రహ్మముడి మాత్రం వారి మధ్యగా ఉంటుంది. అప్పుడే తలల నిండా పోసుకున్న తలంబ్రాలు ముత్యాలవలె (ముత్యాలు కాకపోయినా) వారు కదిలినప్పుడల్లా ఒక్కొక్కటే రాలుతుంటాయి.

అమ్మాయికి స్వంత ఆడబడుచు ఉంటే మరీ మంచిది. లేకపోతే వరుసకు అయిన ఆడపడుచయినా - అంతకుముందే మంగళహారతి పళ్లెంతో గడపకు అవలివేపు ప్రత్యక్షమై 'పేర్లు చెప్పి మరీ కదలండి' అని పోలీసు అటెన్షన్‌లో నిలబడుతుంది. తల వంచుకుని ఉన్న అమ్మాయి నవ్విందో లేదో మనకు అంతగా కనపడదు కాని అబ్బాయి మట్టుకు నవ్వీనవ్వనట్లు ఓ చిరునవ్వు విసురుతాడు. అంతటితో అక్కడ చేరిన నారీజనం పెళ్లికొడుకు పక్షమూ, పెళ్లికూతురి పక్షమూగా రెండు జట్లుగా అయి ఛలోక్తుల యుద్ధానికి సన్నద్ధులవుతారు. వరుసయినవారు ఎదటివారిమీద ఓ వాగ్బాణం విసరడమూ, ఆ బాణం అవతలావిడ మధ్యలోనే అందుకుని మరొక శరాగాస్త్రంతో దానిని విరిచివేయడమూ-ఇలా సాగుతుంది కాసేపు. అంతకు ముందు తమ జీవితాల్లో భర్త పేరు భార్య, భార్య పేరు భర్త - ఎన్నిసార్లో అనాలోచితంగా వ్యావహారికంగా ఉచ్చరించి ఉన్నా, ఆ సమయంలో మాత్రం ఎక్కడలేని సిగ్గూ పుట్టుకువస్తుంది వారికి. అమ్మాయి ముందు చెప్పాలని మగపెళ్లివారూ కాదు మీ అబ్బాయే ముందు చెప్పాలని ఆడపెళ్లివారూ - పంతాలవరకూ పోయేటప్పటికి- కాలు మార్చి కాలుమీద నిలబడుతూ ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ నిలువబడతారు వధూవరులు. ఇలా పక్కో అరగంట సేపు నిలువబడినాక మగవాళ్ళు 'ఇంకా ఎంతసేపు నిలువబెడతారు, కానివ్వండి త్వరగా'...అని కేక వేయటమూ ముందు


ఇందాకా మధ్యాహ్నం
విశాలి
వచ్చిందండోయ్
విశాలి
ఎవరూ?


అదే- సత్తినారాయణ
తమ్ముడికిచ్చారూ
ఆ అమ్మాయి
ఏ
సత్తినారాయణ?


అదేనండీ- సత్తిగాడు
అంటూండే
వాళ్లం—
ఓహో — ఏం
చేస్తున్నా
డేవిటో?


మర్చిపోయాను
స్మండీ విశాలిని
అడగడం
ఏ విశాలి?


అదే— సత్తినారాయణ
తమ్ము......,



వరుడూ, ఆ వెనుక వధువూ చకచక పేర్లు చెప్పివేయటమూ జరుగుతుంది. ఇంకొ గడసరి ఆడపడుచయితే 'మాకు వినపడలేదమ్మా నీవు చెప్పిన పేరు' అంటూ అమ్మాయిచేత మళ్లా పేరు చెప్పించి మరీ వదలిపెడుతుందనుకోండి. అది వేరే సంగతి.

వివాహ కార్యాల్లో మనవాళ్ళు వేడుకల పేరిట, వినోదంపేట జరిపే అనేకతంతుల్లో ఇదొకటి. కాని అన్నిటిలా ఈ వేడుక వివాహంతో ముగియక దీని తాలూకు ప్రభావం భార్యాభర్తల జీవితాలతో పెనవేసుకుని సాగుతుంది. ఎంత వయసు వచ్చినా, ఎన్ని సంవత్సరాలు కాపురం చేసి ప్రౌఢ అయినా భార్య, భర్తను పేరుపెట్టి పిలవదు సరికదా — ఏ సందర్భంలోనయినా ఆ పేరు ఉచ్చరించవలసినప్పుడూ పదహారేళ్ళ నవవధువులా సిగ్గుపడి ఏదోవిధంగా తప్పించుకుంటుంది. అలనాటి పెళ్ళినాటి ఈ మధురమైన అనుభవం తెలుగునాట ప్రతి జీవితంలోనూ అలా అలా తొంగిచూస్తూనే ఉంటుంది. ఇప్పుడిప్పుడు భర్తలు భార్యల్ని పేరుపెట్టి పిలవటం సర్వసామాన్యమైంది కాని, కొంతకాలం క్రిందటివరకూ అలా బహిరంగంగా భార్యపేరు ఉచ్చరించటం సంప్రదాయ విరుద్ధంగా పరిగణింపబడేది.

ఈ సంప్రదాయబలిం ఎంత గాఢమైనదో నాకు ఈమధ్యవరకు తెలియలేదు. నేనసలు చాలా ఆధునాతనమైన అభిప్రాయాలు కలదాన్నని నా ఉద్దేశ్యం. ఏ భావాలు ఆధునికమైనవి, ఏవి పురాతనమైనవి- అని ప్రశ్నవేస్తే నిక్కచ్చి అయిన కొలబద్ద నావద్ద లేనిమాట నిజం. కాని అర్థంలేని కొన్ని మూఢ ఆచారాలు, పిచ్చి నమ్మకాలు - వీటియందు ఒక విధమైన నిరసన ఉన్నమాట కూడా నిజం. ఈనా భావాలను దాచుకోవటానికి నేను ఎప్పుడూ ప్రయత్నించలేదు కూడాను. ఈ కారణంగా నాకూ మా యింట్లో వారికీ చిన్న చిన్న సంఘర్షణలులాంటివి జరగటం కద్దు.

నేను చదువుకున్న ఆడపిల్లల మిషనరీ స్కూలులో మూడువంతులు క్రైస్తవులు, ఒక వంతుహిందువులు - ఉండేవారము. వికసించీ వికసించని అర విరిసిన ప్రసూనాలవంటి చిలుత వయస్సులు. పదమూడు, పదునాల్గు సంవత్సరాల ఆ ప్రాయంలో ఈ విశాల విశ్వంలో మాకు అవసరం లేనిదీ, ఆశ్చర్యం కలిగించనిదీ అయిన విషయమే ఉండేది కాదు. మా విద్యార్థినీ సముదాయమంతా ఆ మిడి మిడి జ్ఞానం తోనే ప్రపంచంలోని బహుళమైన వ్యాపారము లన్నిటినిగురించీ వాదోపవాదాలు చేస్తూ ఉండే వారము. హిందూమతిమూ, అందలి ఆచారసంస్కృతులూ మన దేవతలూ, విగ్రహారాధనా — ఒకటేమిటి - అన్నీ చర్చకు వస్తుండేవి. ప్రతిభా వ్యుత్పత్తులు కాని తర్కజ్ఞానము

# సీతమ్మకథ

...ని ఆ చర్చలలో ఎక్కడా నిలిచేవి కావనుకోండి. ఒకవిధంగా. తాను పుట్టి, పెరిగిన వ్యవస్థ, మతాభిమానంతో, ఎదటివారి మతాలను, ఆచారాలను వెళాకోళంతో క్రిందుచేయటం ఆ చర్చల ముఖ్యోద్దేశ్యంగా ఉండేది. ఆ వివాదాలలో తరుచు ఒకప్రశ్న నన్ను వేధిస్తుండేది.

'మీ హిందువులు భార్యాభర్తలు ఒకరి పేరు ఒకరు చెప్పరట కదా? పేరుతో పిలుచుకుంటే తప్పేమిటి? మాలో చూడు, చక్కగా పేరుపెట్టి మేరీ, అనీ, జాక్ అనీ ఇలా చనువుగా పిలుచుకుంటారు' - అని. ఈ ప్రశ్న నాలో ఆలోచనలు, కలిగించేది. 'నిజమే, తప్పేమిటి? ఇది వట్టి మూఢాచారం' అని అనిపించేది.

అమ్మ ఈ మూఢత్వానికి ఒక మచ్చుతునక కూడా అవును అని. ఒకటి రెండు సంఘటనలు జరిగినప్పుడు నా మనస్సులో రూఢిపడిపోయింది. అమ్మ ఏ సందర్భంలోనూ నాన్నగారి పేరు ఉచ్చరించడం ఇంతవరకూ మేము వినలేదు. పైగా - నాన్నగారి పేరుగల మరెవరి సంగతయినా చెప్పవలసి వచ్చినప్పుడు చమత్కారంగా 'మీ నాన్నగారి పేరుగలాయన' అనో 'ఫలాని ఎల్లయ్యగారు' అనో చెప్పి తప్పించుకునేది. ఇలా నాన్నగారి పేరుకు 'ఎల్లయ్యగారు' అనే నామధేయం ప్రతివచనంగా ప్రతిపాద్యమైనది.

సర్వోదయ పాత్రలు ఇంటింటా కొత్తగా వెలిసిన రోజులవి. ప్రతి ఉదయమూ భుజించబోయేముందు గృహిణి కాని, చిన్నపిల్లలు కాని పిడికెడు బియ్యం ఆ పాత్రలో వెయ్యాలనేది అందు ముఖ్యోద్దేశం. వారానికొకతూరి సర్వోదయ సంఘ సేవకులు వచ్చి ఆ బియ్యం పోగుచేసుకుని వెళతారు. వారివద్ద సర్వోదయపాత్ర లిచ్చిన వారిపేర్ల జాబితా ఉంటుంది. బియ్యం తీసుకున్నాక ఆ యింటి యజమాని పేరును వారి జాబితాలో గుర్తుపెట్టుకుని మరీ వెళతారు.

అలా కొన్ని వారాలు జరిగాక ఒకవారం ఎప్పుడూ మామూలుగా వచ్చేవారుకాక కొత్తవారు సర్వోదయ పాత్రకోసం రావటం జరిగింది. నేను లోపల ఏదో నవలగావును చదువుకుంటున్నాను. అమ్మ సర్వోదయ పాత్ర ఇచ్చింది కాబోలును-వాళ్ళు బియ్యం పోసుకుని కొత్తవారవటంవలన నాన్నగారి పేరు అడిగారు.

“అమ్మాయ్, ఇలా రావే, వీళ్లకు నాన్నగారి పేరు చెప్పిపో”...అని బిగ్గరగా కేకవేసింది అమ్మ. నాకు కథలో అంతరాయం కలిగినందుకు కలిగిన చిరాకుతో “అబ్బ, నువు చెబుదూ అమ్మా. నేను చదువుకుంటున్నాను”...అని తిరిగి కేకవేశాను. అలా అనటంలో 'అమ్మ నాన్నగారి పేరు ఎందుకు చెప్పకూడదు'...అని పంతమూ ఉందనుకోండి. అమ్మ పేరు చెప్పలేదు. కోపంగా లోపలకువచ్చి 'నీకొక్కదూ చెపుతుంటే'... అని గదిమి నన్ను బయటకు పంపించింది. వారికి పేరుచెప్పి లోపలకు వచ్చిన నన్ను నాలుగు చీవాట్లూ వేసింది.

ఇంతటితో కథ అవలేదు. నేను మూఢాచారమని గర్హించిన ఈ పట్టింపు విషయంలో అనుకోకుండా అమ్మకు నేనూ వారసురాలినయ్యాను. ఇలా నన్ను కట్టివేసిన సంప్రదాయ బలిమి ఎటువంటిదో కూడా చెబుతాను.

చక్కెరకు కరువువచ్చి రేషను కొత్తగా పెట్టిన ఈ మధ్యరోజులే అవి. పదేళ్ల పిల్ల. పక్కయింటి అమ్మాయిని తీసుకుని దుకాణానికి వెళ్ళాను ఆ రోజున. కోటా ప్రకారం చక్కెర ఇవ్వగానే టేబిల్ ముందు ఫైలు వేసుకుని కుర్చీలో కూర్చున్న ఆసామీ “పేరు?...” అన్నాడు కలం చేతిలోకి తీసుకుంటూ. చప్పున నా పేరు చెప్పాను. ఆ ఆసామీ విసుక్కుంటూ 'మీ పేరు కాదమ్మా, ఇంటి యజమాని పేరు'అన్నాడు కళ్లజోడు సరిచేసుకుంటూ. చెప్పవచ్చునా, ఏ సంస్కారబలిమి అడ్డువచ్చిందో తెలియదు - ఏమి అంటు

## సరళ సలహా!

వయసులో వుండి వలపు తలపులలో కలలుకనే ఆడపిల్లలకు సహజంగానే కొన్ని కోరికలుంటాయి.

రకరకాల రంగురంగుల సరికొత్త బాణీల ఓణీలు వేయాలనో, నగలు పెట్టుకోవాలనో, సౌందర్య పోషణ చేసుకోవాలనో ఉంటుంది. ఉండటం సహజం. అది తప్పుకాదు.

అయితే ఆ కోరికలు పరిమితంగా ఉండాలి. అంతరంగికంగానే ఉండాలి. అందరి కళ్లపడి విమర్శలకు గురికారాదు. నైలాన్ కట్టుకోవాలని ఉందనుకోండి. అది ఈసడించే ముసలమ్మలదగ్గరా, వెక్కిరించే పాటివారి ఎదుట అవి కట్టకండి. మీ ఒంటరితనంలోనో, తీయని జంటరితనంలోనో నైలాన్ నవలావణ్యం అనందించండి. కాటన్ నైలాన్ లంటూ ఈమధ్య వస్తున్న రకం అంతా కట్టుకోవచ్చు. ఎబ్బెట్టుగా ఉండదు.

కట్టివ అందంఉండేబట్ట కట్టినప్పుడే అందం.

న్నానో ఇంకా నాకు తెలియకముందే 'చెప్పమ్మా బావగారి పేరట' అని ఆ పిల్లకు చటుక్కున పురమాయించాను! ఆ తర్వాత ఆ పిల్ల ఆయనగారి పేరు చెప్పటమూ అతడు వ్రాసుకోవటమూ యాంత్రికంగా జరిగిపోయాయి. ఆ మాట నా నోట జారింది—ఏదో పోగొట్టుకున్నదానిలా, నేను నిరసిస్తున్న ఏ సంప్రదాయమో నన్ను జయించివేసినట్లు—నీరస పడిపోయాను. పేరు వ్రాసుకుంటూ మీసాల చాటున ఆ ఆసామీ నున్నగా నవ్వినట్లు కూడా నా అనుమానం. అది నా భ్రమో, లేక అతగాడు నన్ను చూచి నిజంగానే నవ్వాడో—అనే విషయం అప్పటికీ ఇప్పటికీ నాకంత పట్టలేదు. కాని తరతరాలుగా నాలో జీర్ణించిపోయిన సంస్కారలేశం, ఆచార బలిమి—నన్ను ఇంత నిగూఢంగా ఆవరించి ఉందని ఆ క్షణంలో తెలిసి విస్మయంలో మునిగిపోయాను. ఆ క్షణాన దూరానఉన్న అమ్మ జ్ఞాపకం వచ్చింది. 'ఇలా ఎలా జరిగింది'...అని తర్కంలోపడ్డ నాకు ఇంటికి చేరేవరకు ఆ పిల్ల నిశ్శబ్దంగా నా పక్కను నడుస్తున్న సంగతి జ్ఞాపకంలేదు

వత్తులు చేసుకుంటూ బామ్మ ఒక పాట పాడుతుండేది. ఆవిడ లెక్కలేనన్ని పాటలు పాడేది. అందులో ఇదొకటి.

శివుని విల్లును విరిచి సీతమ్మను గెలుచుకున్న మహావీరుడు. నూనూగు మీసాల సుందర రామమూర్తి, రామచంద్రుడు సీతమ్మకేలు పుచ్చుకుని వాకిటి ముందు నిలువబడి ఉంటాడు. రామయ్యావివాహానికి పేరంటాండ్రకు కొరతేముంది? వారి ఉత్సాహాతిశయం వెల్లువ వలె ఉన్నది.

'శ్రీరామా నీ భామ పేరేమి చెపుమా—ఆ పేరు నీవు జెప్ప వినగోరితి సుమ్మా'—అంటూ ఒక ముత్తయిదువ ముచ్చట పడుతూ అడుగుతుంది. రామభద్రునకు నవ్వువస్తుంది. 'నా సతి పేరు మీరు యెపుడు వినలేదా'...అని యుక్తిగా పరాచికాలాడుతున్న ఆ స్త్రీలను ప్రశ్నిస్తాడు. 'సతిపేరు చెప్పితే సకల లోకముల వారపహాస్య మొనరింతురని చెప్పలేదా' అని అనునయంగా అడుగుతాడు. కాని ఆ ప్రౌఢలు ఈ మాటలకు మోసపోలేదు. 'లోకములన్నీ నీలోనివే కదా, నిన్నపహాస్యం చేసే వారెవరోయీ రామచంద్రా!...అంటూ ఒక పడుచు పృచ్ఛిస్తుంది. 'మే మింక చెదరంగ పోము మీ సుదవతి పేరు చెప్పకా, మరి తల్పు తీయ్యము'...అంటూ బెదిరిస్తుంది మరొక వనిత. రాముడు మహా చతురజ్ఞుడు 'అలా అయితే వినండి చెప్పేస్తున్నాను—'వైదేహి'.. అంటూ గుమ్మం దాటటానికి ఉంకిస్తాడు. చుట్టూ చేరిన భామామణులు వాకిలికి అడ్డుగోడ కట్టి 'ఇదేమిటయ్యా, ఏదో మర్మంగా చెపుతున్నావు? మా అమ్మాయి పేరు అది కాదు. నిజమైనపేరు చెప్పి మరీ కదులు'...అని పట్టుపడతారు. రాముడూ ఓడిపోయినానని ఒప్పుకుని చిరునవ్వులతో సీతమ్మపేరు పలుకుతాడు.

అప్పుడా భామలకు సగం ముచ్చట తీరింది. తల భూమివేపు ఓరగా వంచి సిగ్గుపడుతూ నిలువబడిన భూమిజను చుట్టుముట్టి వారంటారు:

'సీతమ్మ నీ భర్తపేరూ చెప్పవమ్మా చేతో మోదముతోడను"

సీతమ్మ అసలే ముగ్ధ. అందులోనూ కొత్త పెండ్లికూతురు. సిగ్గుతో కుంచించుకపోతున్న జానకి రామభద్రుని పేరు నోటితో ఎలా ఉచ్చరిస్తుంది? అందులో రఘురాముడు ప్రక్కనున్నాడాయె. సరాగాలలో తలమునకలవుతున్న ఆ పేరంటాండ్రకు ఇదేమీ పట్టలేదు. సీతాదేవికి ఏమీ పాలుపోలేదు. దగ్గరగాఉన్న చెలితో 'నాథుని పేరు రేపు చెప్తాను కానీ ఇప్పటికి పోనివ్వండి...'అని మెల్లగా చెప్పుకొన్నది. వారామెకు ఎప్పుడైనా చెలులేమో కాని ఇప్పుడుమాత్రం కారు. 'అలా అయితే అమ్మాయీ, రేపటి దాకా ఈ విధంగానే గుమ్మంముందు నిలువబడి ఉండు...' అని దృఢంగా తమ ఉద్దేశ్యం చెబుతారు. పాపం! ఆ పెండ్లికూతురు నిస్సహాయ అయిపోయింది. సిగ్గుదొంతరలమాటున రఘువీరుని నామం ఎలాగో అనేసి అప్పటికి చెలులను వదిలించుకుంటుంది.

ఇదీ ఆ పాటల భావం. ఈ వేడుకలోని యుక్తాయుక్తత కాని, ఈ పాటలోని భావాన్ని గురించిన సత్యాసత్యాలు కాని మన కనవసరం. ఈ వినోదం కలిగించే రసానందం అట్టిది. అందలి మధురానుభూతి అట్టిది.

అంతటి లోకాధీశునకే తప్పలేదు—మరి మనమెంత?...అని ఆ నాటి నా ఓటమి జ్ఞాపకం వచ్చినప్పుడల్లా నన్ను నేనే సమాధాయించుకుంటుంటాను. 

ఉపాధ్యాయుడు - ఔరంగజేబు దుర్మార్గుడని ఎలా చెప్పగలవురా?

విద్యార్థి - నోటితో సార్.

—టి. హనుమంతరెడ్డి (కవకుంట్ల)

## కర్టెను క్లాతుమూలలకు డిజైన్లు




—సుహాసిని (రాజమండ్రి)

# వనితా వాణి



వారి ముఖము సౌందర్యముగా ఉన్నా వారు కట్టుకున్న బట్టలు తమ శరీరానికి సొగసుగా కనుపించదు. వారు ఇంత విమర్శగా వ్రాసినందుకు వారికి మీ పత్రికద్వారా నా ధన్యవాదములు తెలియజేస్తున్నాను.

శాంతాకారు ముంగి మోహన్ (ఖమ్మం)

*　　*　　*

19-10-60 పత్రికలో పి. హెచ్. సీత గారు వ్రాసిన స్త్రీలకు యోగ్యమైనవిద్య ఏలాంటిది? అనే వ్యాసము చాలబాగున్నది. మొదటి రెండు వ్యాసాలకంటె సీతగారు వ్రాసిన వ్యాసము నన్ను బాగా ఆకర్షించినది. సీతగారు అంతబాగా వ్రాసినందులకు నా హృదయపూర్వకముగా ధన్యవాదములు.

వి. అంజని (హైదరాబాదు)

*　　*　　*

## అభినందన

డి. విశాలాక్షిగారు వ్రాసిన ఊలు డ్రెస్సులుకుట్టే పద్ధతిని నేను ప్రయత్నించాను. మా అక్కకూ తురికి మేజోళ్ళు తయారయ్యాయి. అవి చూసి మాయింట్లో అందరూ మెచ్చుకున్నారు. విశాలాక్షిరావుగారికి నా అభివందనములు.

ఎస్. రాధిక (మచిలీపట్నం)

*　　*　　*

## ముఖారవిందం

2-11-60 తేదీ వారపత్రికలో భూపతి రాజు సరస్వతిగారు వ్రాసిన "ముఖారవిందం" అను వ్యాసం చాలా బాగుంది. ముఖం అందంగాను నునుపుగాను ఉండుటకు ఆవిడ చెప్పిన సూచనలన్నీ బావున్నవి.

కొంతమంది స్త్రీలకు చెంపలవద్దను మూతిపైనకూడా వెంట్రుకలు వున్నవి. ఆవిడగారు రోజూ పసుపురుద్దుకుంటే తప్పకుండా పోతవి అని వ్రాసినారు. కాని మేము కొన్ని నెలల నుండి పసుపు తరువాత పసుపు ఉప్పు, కలిపి కూడా రుద్దుకొని చూచినాము కాని అవి పోలేదు. అవి పోవుటకు వేరే ఏదైన మార్గముంటే, సోదరీమణుల కెవరికైనా తెలిసివుంటే దయచేసి వనితావాణిద్వారా తెలుపగోరినాను. ఆ వెంట్రుకలు వుంటే ఎంత వికారంగా వుంటుందో వనితలకే తెలుసు. తప్పక నివారణోపాయం తెలిపేది.

సోదరి (అనంతపురం)

*　　*　　*

2-11-60 వారపత్రికలోని రాజ్యలక్ష్మి గారు వ్రాసిన వగసలూ–నెరుసులూ అను వ్యాసం చాలా బాగా వ్రాశారు. ఇటువంటివారు వీళ్ల మీద యెంతో ప్రేమవున్నట్టు మాట్లాడుతూనే, వదినా మరదళ్ళకు – అత్తాకోడళ్లకు–పచ్చటిసంసారాల్లో నునిప్పులుపోస్తారు.

ఇటువంటివారు ఈవ్యాసము చదివైనా బుద్ధి తెచ్చుకుంటారని ఆశిస్తున్నా.

రాజ్యలక్ష్మిగార్కి నా ధన్యవాదాలు,

యస్. పార్వతి (నెల్లూరు)

*　　*　　*

సోదరి వి. ఇందిరాదేవిగారు వ్రాసిన, సందేహాన్ని చదివాను. గద్వాలచీరలు ఎలా వుతకాలో, నా స్వానుభవంవల్ల తెలిసిన విధం చెబుతాను. ఈ ప్రాంతంవాళ్లు ఎక్కువగా ఆ చీరలు కడుతారు. ఎన్నిసార్లు వుతికినా. లేవుకేసినా, ఛాయపోవు. ఐతే, మొదట కొంగు అంచులు కట్టేసి, చీరమాత్రం తడిపి, సోపుతో పులిమి తరవాత చీరనంతా పిండి ఆరేయ్యాలి. తెల్లచీరలు గూడ ఇలాగే చాకలికి వేసేప్పుడు కొంగు అంచులు కట్టి వుతకమంటే సరి. తెల్లగా, మల్లెపువ్వుల్లాగ వుంటాయి. అంతేకాని ఎక్కువ శ్రమ పడనక్కరలేదు.

యస్. వి. లక్ష్మి (కర్నూలు)

*　　*　　*

మీ సంచిక ది॥ 26-10 60 లో వనితా లోకం శీర్షిక క్రింద కుమారి పులిపాక అంజనా దేవిగారు చెప్పినట్లుగా "ప్లాస్టిక్ పేపరుతో హేండ్ బాగ్" ను తయారు చేసినాను. చాలాబాగా వచ్చినది. మీపత్రికద్వారా రచయిత్రి కుమారి పులిపాక అంజనాదేవి గారికి నా హృదయపూర్వకాభి వందనములు అందచేస్తారని ఆశించుచున్నాను.

దయచేసి సోదరీమణులెవరికైనా "దోస ఆవకాయ" తయారుచేయడం తెలిసిన వనితా వాణిద్వారా తెలియచేయకోరుతాను.

కుమారి రఘునాయకుల రమణి (బందరు)

*　　*　　*

2-11-1960 న వెలువడిన "ఆంధ్రపత్రిక"లో భూపతిరాజు సరస్వతిగారు వ్రాసిన "ముఖారవిందం" చాలా బాగా వ్రాసినారు. వారు వ్రాసినది చాలా వాస్తవికంగా వ్రాసినారు. ఈ రోజుల్లో కొందరు స్త్రీలు తాము ధరించేవిచూస్తే చాలా వికారంగా ఉంటవి.

## కొబ్బరి పీచుతో కాళ్ళు తుడుచుకొనే పట్టా

ఆంధ్ర సచిత్ర వారపత్రిక వనితావాణిలో ఎస్. కన్నమణిగారు కొబ్బరి పీచుతో కాళ్లు తుడుచుకొనే పట్టాను ఎలా తయారు చేయాలో తెలుపవలసినదిగా కోరారు. కాబట్టి నాకు తెలిసిన ఒక పద్ధతిని తెలియజేయుచున్నాను.

ఎక్కువగా కొబ్బరి పీచును తీసుకొని ఒక నీళ్ళతొట్టెలోవేసి 1 ప్రూరం నాన నివ్వాలి. తరువాత దానిని బయటకు తీసి నీళ్ళన్నీ ఓడిగిలిన తరవాత ఓపికతో శుభ్రముగా విడదీయాలి. అంతా విడదీసిన తరువాత 2 అం॥ల వె॥ 2 అం॥ మందముతో జడలాగా పొడవుగా అలాగే అల్లాలి. మనం జడను మొదలుపెట్టి అల్లేటప్పుడు పైనుంచి వూడిపోకుండా వుండుటకుగాను ఏదైనా కొసతో గట్టిగా కట్టాలి. మనము ముందుగా ఒక కేంద్రమును తీసుకొని (దానిని మధ్యభాగముగా గుర్తుంచుకోవాలి.) ఆ కేంద్రముపై జడయొక్క మధ్య భాగమును ఉంచి ఒకచుట్టు తర్వాత యింకొక చుట్టు మన యిష్టమైన సైజు వరకు చుట్టుకోవాలి. ఆ చుట్టలు వూడకుండా వుండుటకు గాను ఒకదాని నొకటి సూది దారములో జాయింటు చేస్తూ రావాలి.

జడ చివరకూడా మొదలులాగే సులక త్రాడుతోగాని మరి గేనితోనైన గాని గట్టిగా వూడకుండా కట్టి చుట్టంతా చుట్టిన తరువాత గట్టిగా ఆ త్రాడుతో బిగించాలి. తరువాత మధ్యభాగములో పెట్టిన మొదటి భాగము యొక్క త్రాడు కనిపించకుండా ఉండుటకుగాను మంచి క్లాత్ తో చిన్న పూవులాగా తయారుచేసి మధ్యభాగములో కుట్టవలెను. ఆ చుట్ట చుట్టూ మంచి క్లాత్ తో పైపింగ్ కుట్టిన చూడటానికి అందముగాను ఉపయోగకరముగా ఉండును.

డి. దేవి (నిడుబ్రోలు)



# హరివంశము

## మధురా పర్వము—8

తతస్సమస్త మంచేషు నాగరస్స తదాజనః
రాజమంచేషు చారూఢా స్సహభృత్యైర్నరాధిపః
నాగరీయోషితాం మధ్యే దేవకీ పుత్ర గర్ధినీ
అంత కాలేపి పుత్రస్య ద్రక్ష్యామీతి ముఖం స్థితా
—విష్ణుపురాణం

అంతలో తెల్లవారింది. హంసుడు ప్రాచ్యపర్వతశిఖాగ్రవతంస తను పొందినాడు. రాజశాసనాన్ని అనుసరించి పురంలోని ఎల్లవారు కై సేసికొని మల్లయుద్ధంలో రామకృష్ణుల పరాక్రమాన్ని ఆలోకించాలనే కౌతూహలంతో ఉల్లములు పల్లవింపగా మహా రంగ స్థలాన్ని చేరుకున్నారు. ఆ జనంతో ప్రేక్షాగారం అపూర్యమాణమై, సముద్రాన్ని పోలి, కోలాహలంగా వుంది. మంచాగారం ప్రాఙ్ముఖమై, సచిత్రాష్టస్త్రీచరణములు, సార్గళద్వారవేదికములు, సగవాక్షార్ధచంద్రములు, సతల్పోత్తమ భూషితములు అయిన మంచముల చేత, తమగముల చేత ఒప్పమిగులుతున్నది. కొన్ని మంచములు చారు నిర్వ్యక్తములై, పుష్పదామముల చేత అలంకరింపబడి, శరత్కాలతోయదాలను పోలి ఒప్పమిగులుతున్నాయి. అవి రాణివాసంకోసం అయిన మంచములు. విరళతంతువులైన అంతఃపటములతో, అవి సంవృతములై వున్నాయి. అచ్చటివారు బయటివారికి కన్పించరు. బయట ఏమి జరుగుచున్నదో అచ్చట కూర్చుండువారికి అంతా కన్పిస్తుంది. ఏతాదృక్ వైభవ మర్యాదంగా రాణివాసపు మంచాగారం నిర్మితమైంది. మరి రాజులకు వేరుగా, మల్లులకు వేరుగా, నాగర స్త్రీ జనాలకు వేరుగా, వారవిలాసినులకు వేరుగా, పౌరజానపదులకు వేరుగా మంచాగారాలు ఏర్పాటై వున్నాయి. ఇన్ని విధములైన మంచాగారములతోను ఆ సమాజవాటం సవేఘౌఘమైన సముద్రాన్ని పోలి ప్రశస్తి వహిస్తున్నది. ఆ మల్లసంగరాన్ని వీక్షించడానికి వచ్చిన జనంలో వివిధ జాతుల జనము, వివిధ శ్రేణుల జనము వున్నారు. ఏ జాతికి ఆ జాతికి, ఏ శ్రేణికి ఆ శ్రేణికి వేరువేరుగా మంచాగారాలు నిర్మాణం అయివున్నాయి. ఏజాతికి ఆజాతి తనతన జాతికి చిహ్నమైన పతాకాలతో వచ్చి, యథాస్థానమునందు ఉపవిష్టం అయి వుంది. ఏయే శిల్పంచేత ఎవరు ఎవరు ఉపజీవనం నడుపుకుంటున్నారో, వారంతా శ్రేణుల క్రింద ఏర్పడటం వున్నది గనుక, వారు ఇప్పుడు, ఈ మల్లక్రీడామహోత్సవానికి స్వకర్మద్రవ్యచిహ్నితములైన పతాకాలతో వచ్చి, తమకు తమకు ప్రత్యేకింపబడిన స్థానాలను ఆక్రమించుకున్నారు. ఆ స్థాన వివక్ష కూడా ఆయా వృత్తి కర్మోచితమైన కర్మద్రవ్య ముద్రికల చేతనే సూచితమౌతున్నది. ఇప్పుడు ఇన్ని పతాకలతో ఆ మంచాగారాలు అలంకరింపబడిన పర్వతాలను పోలి కన్పిస్తున్నాయి.

అంతఃపుర జనంకోసం నిర్మింపబడిన ప్రేక్షాగారాలు కాంచన చిత్రములతో, రత్నజ్వాలాకులంగా ప్రకాశిస్తున్నాయి. విచిత్రములైన తెరచీరలు ఇరుదెసల ఉల్లసిల్లగా ఆ మేటి తమగములు రెక్కలతోడి పర్వతాలనుపోలి చూపరకు బహుశ్వేతపర్వతములు ఒక్కచో చేరిన భ్రాంతిని కల్పిస్తున్నాయి. చామరధారిణులు, నానావిధ భూషణాలంకృతులు, విచిత్రములయిన భాషలతో ఒకరిని ఒకరు పలకరించుకుంటున్నవారు, విచిత్రాంబరములతో అగ్నినిపోలి ప్రకాశిస్తున్నవారు, దాసదాసీజనాలతో ఆకీర్ణమై, ఆ మంచాగారం అంతా అంతఃపురంలాగే ఒప్పమిగులుతున్నది.

గణికలకు పెద్దపెద్ద తమగాలతో ప్రేక్షాగారం నిర్మితమైంది. ఆ తమగాలు విమానాకారాలుగా వుండి, ఆ స్తరణాంబరాలతో శోభనంగా, ఓజస్సుతో కూడి, వైమానికలోకాన్ని జ్ఞప్తికి తెస్తున్నాయి. కొన్ని ఆసనములు పర్యంకములను పోలి, కొన్ని ఆసనములు శయనములను పోలి, హిరణ్మయములు, సపుష్పస్తబకవృతములై, చిత్రములై కన్పిస్తున్నాయి. వారకామినులు సవిలాస విక్షేపంగా ఆ ఆసనములను గూడా ఆక్రమించుకుంటున్నారు.

మహారంగం అంతటా చుక్రికాది పానరసములు, చాంగేర్యములు, ప్రేక్షక మహాజనంకోసం గోష్ఠీమందిరాలలో సంతరించబడినాయి ఆ పానగోష్ఠులు ఘటాపదంశపూర్ణములై వున్నాయి. బంగారు పానకుంభములతో ఆ పానభూమి ఒప్పమిగులుతోంది.

జఘన్యులయిన జనులకోసం కాష్ఠ సంచయ బంధనములైన మంచములు ఏర్పాటు చేయబడినాయి. ఇవి అనేకంగా వున్నాయి. వందలుగా, సహస్రములుగా వున్నాయి. వేలకొలది జనం ఈ మంచములమీద ఆసీనులై వున్నారు.

ఇట్లా మహాజనంతో ఆ మహారంగం సంతుష్ట లోకాంతరంగమై ఒప్పమిగులుతున్నది. పాషాణ వల్మీక పంకాది రహితము, మృదులకాంచననిభమృణ్మయము, కమనీయ కస్తూరికాజలసిక్తము, బద్ధచందనదారు పరివృతము, మహనీయ కుసుమదామ ధ్వజతోరణ మండితము, బ్రాహ్మణక్షత్రాది పౌర కోలాహలము, ప్రశాంత తూర్యత్రయాంచితము, నిర్మలము, సమము, నిష్కంటకము, కంస సైన్యతుంగము అయి కంసునిలో లోపించిన సర్వమైన ఉత్సాహము దీప్తివహించి వ్యాప్తిచెందినట్లు సుపర్యాప్తమైవుంది. ఉత్సాహసంజనితకోలాహలసంఘుష్యమాణ కకుబంతమైవుంది. రంగమధ్యంలో ప్రాఙ్ముఖీనమై, చారునిర్వ్యక్తమై, మేరుశృంగసమప్రభమై, రుక్మపత్రనిభస్తంభసమన్వితమై, చిత్రనిర్వ్యూగశోభితమై, ఉన్నతమై, కంసుని ప్రేక్షాగారం, క్షీరసముద్రమధ్యస్థ మంధరపర్వతాన్ని పోలి, అధికంగా ప్రకాశిస్తున్నది. నివాసాకృతలక్షణములైన మాల్యదామములతో శోభిస్తోంది. మహారంగం అంతా నానాజనాకీర్ణమై, జనౌఘప్రతినాదియైపోయింది గాని ఇంకా కంసుడు, మధురేశ్వరుడు రాలేదు. మహారాజు ఇంకా రాలేదు అని జనం అనుకున్నంతలో వాదిత్రముల విచిత్రధ్వానములు వినవచ్చాయి. రాజు వస్తున్నాడు అనడానికి ఆ ధ్వనులు గుర్తులు. ప్రేక్షకమహాజనం ఆ ధ్వనులు విన్పించినంతలో మధురేశ్వరదిదృక్షాలాలసం అయి

హారిత శివశర్మ

# హరివంశము

పోయింది. మహారంగం ఒక్కసారిగా సద్దుమణిగింది. మహారాజు, మధురేశ్వరుడు, ధవళాంబరములు ధరించి, ముక్తామణిభూషణములను కైసేసికొని, వలిగొడుగులు, వింజామరలు పట్టుకొని విలాసినులు విలసితాంపాంగరోమలుగా వెంటరా, సామాత్యుడు, సమస్తపరిజనాలతో, ఒక్క తెలుపై, చంద్రోదయోద్దామ సౌందర్యాన్ని అభినయిస్తూ, ఆకాశాన్ని పోని కువలయాపీడాన్ని అధిరోహించి సమాజవాటానికి చనుదెంచాడు. సమాజద్వారంవద్ద మహామాత్రుడు కువలయాపీడాన్ని ఆపగా, రాజు, ఆ ఏనుగుమీదినుండి దిగాడు. రాజును, మధురేశ్వరుణ్ణి, కంసుణ్ణి చూడగా మహారంగం చంద్రదర్శనం కాగా, సముద్ర తరంగాలు పొంగినట్లు పొంగింది. శుక్లవాసస్సును, శ్వేతవ్యజనచామరుణ్ణి, శ్వేతముకుటుణ్ణి, శ్వేతాభ్రపు మధ్యంలో ప్రకాశిస్తున్న చంద్రుణ్ణి పోలివున్నవాణ్ణి, రంగమధ్యంలో ఉన్న సింహాసనంమీద ఆసీనుడౌతున్నవాణ్ణి, అప్రతిమరూపుణ్ణి కంసుణ్ణి, రాజును, మధురేశ్వరుణ్ణి చూచి పౌరులు, సంహృష్టులై, జయాశీషముల పల్కారు. కంసుడు ఆ జయాశీషములను స్వీకరిస్తున్నట్లు శిరఃకంపనం చేస్తూ, సమాజవాటం అంతా కలయచూచినాడు. సర్వభోజాంధకవృష్ణిప్రవరులందరు వచ్చారు. మహాపౌరులంతా వచ్చారు. నాగరస్త్రీలు వచ్చారు. అంతఃపుర స్త్రీలకోసం కట్టించిన ప్రేక్షాగారం కిటకిటలాడుతూ వుంది. లోపలివారు తనకు కన్పించడం లేదు. దేవకి, దేవతోపమ, ఎక్కడవున్నది? కంసుని దృష్టి సునిశితమై నాగరస్త్రీజన స్థానాలను అవలోకించింది. దేవకి రాజస్త్రీ. నాగరస్త్రీలలో ఆసీనురాలౌతుందా? ఆ అనుమానం తనకు కల్గడమే కంసునకు విచిత్రమనిపించింది. కంసుడు నాగరస్త్రీజనస్థానాలను పరికించినాడు. దేవకి ఆ స్త్రీలలో వున్నది. ఆమె ప్రక్కన ఆ వున్నది యెవ్వరు? ఒక్కర్తుక తన తల్లి; దేవకికి ఒకవైపున ఆమె వున్నది. మరియొకవైపున ఆ వున్నది యెవ్వర్తుక? ఆమె నాగరికస్త్రీ, కాదు. జానపదురాలు. జానపదమైన మాధుర్యం మూర్తిదాల్చినట్లు వుంది. మాతృభావం ఆకారందాల్చినట్లు వుంది. ఆమె యశోద అయివుంటుంది. కంసుడు ఆమెను తదేకదీక్షగా చూచినాడు. ఆమె దేవకి తరువాత దేవకియంతటిది తన చన్నుబాలతో శ్రీకృష్ణదేవుణ్ణి పెంచింది. కంసుడు తిరిగి ఆ నాగరస్త్రీజనస్థానాలను తిలకించినాడు. తన తల్లికి ప్రక్కన క్షత్రియస్త్రీభావం అంతా మూర్తికట్టినట్లువున్న ఆమె యెవ్వర్తుక? అహో! తెలిసినది. ఆమె సంకర్షణ వాసుదేవులకు ప్రథమగురువు. వసుదేవుని ప్రథమ మహిషి. రోహిణి. ఆమె కన్పించగా కంసుడు తన చూపులను మరియొకప్రక్కకు త్రిప్పుకున్నాడు. తాను ఎంతమందినో వంచనచేయగల్గినాడు? ఈ ఒక్కస్త్రీ తన్ను కికురించి తప్పించుకున్నది. మరి ఆమె పౌరవుల ఆడుబడుచు. ఆమెను తాను ఏమియు చేయలేకపోయినాడు. కంసునకు, ఆ యీ తనవైఫల్యము అపజయమై నిల్చిపోయినది.

కంసుని దృష్టి రాజపురుష మంచాగారములమీదకు ప్రసరించినది. అక్కడ వసుదేవుడు, అతనిపజ్జనందుడు, తక్కుంగల ఆభీరవృద్ధులు, తనతండ్రి ఉగ్రసేనుడు, ఇతర యదువృష్ణి భోజాంధకులయిన రాజపురుషప్రవరులు, అంతా అక్కడ వున్నారు. ఆ వసుదేవునియందు, ఆ ఉగ్రసేనునియందు, ఈ సర్వ రాజలోకముఎప్పుడూ మర్యాద చేస్తూ నేవున్నది. మరి తనయందో, భయంచేస్తున్నది. తాను ఆ అందరిని భయపెట్టి, తనలోని భయమును సర్వ యాదవగణసామ్రాజ్యస్థితికి ప్రాతిపదికం చేసినాడు.

కంసుని దృష్టి తిరిగి నాగరస్త్రీజనస్థానములమీదకు పోయినది. తిరిగి దేవకియందు నిల్చినది. ఆ దేవకి ఎట్లా వున్నది? కంసుడు తన చూపులతో ఆమెను పరిశీలించినాడు. నాగరికస్త్రీలమధ్యను దుఃఖం అవతారం ఎత్తినట్లు. పుత్రగర్ధినియైన దేవకి ఉదాసీనయైవున్నది. దేవకి ఎట్లావున్నది? నా కన్నకడుపునకు ఈ రోజుతో రోజులు సరిపోతున్నవి. ఈ అంతకాలంలోనైనా, నా పుత్రుణ్ణి ఒక్కసారి చూచుకుంటాను- అన్నవిధంగా కూర్చున్నది.

అంతలో తిరిగి తూర్యములు మొరసాయి. దుందుభులు మ్రోగాయి. కంసునిదృష్టి, సర్వప్రేక్షక మహాజనదృష్టి అటు మళ్ళినవి. సకలాంభోనిధి మేఖలా వహానాన్ని చాలించి, దిక్కరిప్రవరాలు కదిలివస్తున్నట్లు, సోపాధ్యాయులు, చాణూరముష్టికకూటులు, సలతోసలులు, వల్గువాద్యప్రహార్షితులు, మల్లతళోత్తిగలు, రంగధాత్రిలో



పురుగూ పుట్రా ఉంటాయి పొదల్లో కెళ్ళండి
చిత్రకారుడు: కె. విశ్వనాథ్ (మద్రాసు)

ప్రవేశించారు. వారు కన్పించగా కంసుడు హర్షప్రముదితమనస్కుడై నాడు. ముదితమనస్కుడై తిరిగి దేవకి కూర్చున్నవైపునకు దృష్టి పరపినాడు. ఆ దేవకి ఆ వస్తున్న రాక్షసనిభదేహులను, అవలితాంబరులను, చాణూరముష్టికులను మాత్రమే చూస్తున్నది. ఈ ఇద్దరి నా కంసుడు తన పుత్రులపైకి ఉసికొల్పుతున్నది? అనుకుంటున్నది దేవకి అనుకున్నాడు కంసుడు. అప్పుడు అతని ముఖంపై ఒక చిరునవ్వు ఉదయించింది. అది విషాదానంద సమ్మిశ్రమై, అతని ముఖమునకు ఇడగ్గ ప్రకాశించింది. మల్లులు తమకై ప్రత్యేకించబడిన తమగముల వంక చూచుకున్నారు. తర్వాత రాజు దిక్కు, క్ష్వేడితాస్ఫోటితంగా రాజునకు మల్లవందనం ఆచరించి, తమ స్థానాలను దరిసారు. ఆసీనులైనారు.

కంసుడు తన సింహాసనంమీద నుంచి లేచినాడు. కంచుకులు తమ్ము ఆజ్ఞాపించడంకోసమేమో ననుకున్నారు. కాని కంసుడు వారికి అప్పుడు ఎట్టి ఆజ్ఞయు ఇవ్వలేదు. సింహాసనంమీదనుండి లేచి సభను అతి గంభీరదృక్కు తిలకిస్తూ, సోపానములను ఒకటిఒకటిగా అవరోహించినాడు. ఎందుకో ఎవ్వరికి అర్థము కాలేదు. మల్లురు రాజు తమతో సంభాషించవలెనని సంకల్పించినాడనుకున్నారు. సామంతులు తమ్ముగూర్చి రాజు కదిలివస్తున్నాడనుకున్నారు. సమాజ ద్వారం వద్ద కువలయాపీడమును నిలిపి వుంచిన మహావీరుడు, మహామాత్రుడు, తనకు రాజు కొత్త ఆజ్ఞ ఏమన్నా ఇవ్వడానికి వస్తున్నాడా? అనుకున్నాడు. సభలో ఎవరిభావములు వారివి. కంసునకు వారి ఆ భావములు ఏమీ పట్టినట్లు లేదు. అతడు తన తమగాన్ని అవరోహణము చేసి, నాగరస్త్రీజనస్థానములవైపునకు నడచినాడు. అమాత్యులు అతనిని అనుసరించి రాబోగా వారించినాడు. తాను ఒక్కడు నాగరస్త్రీ జనస్థానాలకు చేరినాడు. రాజుయొక్క ఈ చేత అందరికి ఆశ్చర్యాన్ని కల్గించింది. అదిమాచి రాజపురుషుల వరుసలో అంధకుడు తన ప్రక్కనువున్న అక్రూరుణ్ణి, దానపతిని సంబోధించి ఇట్లా అన్నాడు: అక్రూర! కంసుడు తిరిగి క్రొత్తఎత్తు ఎత్తడము లేదుగద!"

అక్రూరుడు ఏమి అనుకున్నాడో తెలియదు. అతడుగూడ అందరితోపాటు కంసునియందు బద్ధదృష్టియై వుండిపోయినాడు. కంసుడు ఆ పోయిన పోకగా, దేవకిముందు ఆగినాడు. విషాదానంద దృష్టియై ఆమెను తిలకించినాడు. కంసుని మాత, రోహిణి, యశోద, అతని ఈ రాక దేనికో తెలియక తికమకలు పడినారు.

కంసుడు "దేవకీ" అన్నాడు.

దేవకి "కంస" అన్నది.

కంసుడు: దేవకీ! నేటితో నీ నా బాధలు తీరిపోతున్నాయి. నేనో, నీ పుత్రుడో, నేడు తేలిపోతుంది.

దేవకి మాట్లాడలేదు. ఆమెను పరివేష్టించి వున్న రాజస్త్రీలు, నాగరస్త్రీలు కంసుని ఆ మాటలు విని అప్రతిభులై పోయినారు.

కంసుడు మరల దేవకిని సంబోధించినాడు: "దేవకీ! నీకన్న నన్ను గౌరవించినవారు, ప్రేమించినవారు లేరు. నా అవస్థను నీయంతగా అర్థముచేసుకున్నవారు మరిఒక్కరు లేరు. నీవు నా తోడ బుట్టువవు. మనము ఏకోదరులము కాకపోవచ్చును. కాని కంసుని ఇంటికి ఆడుబిడ్డ లెవ్వరు? దేవకీ! ఆ ఆడుబిడ్డవు నీవు. నేను ధనుర్మహము తలపెట్టగా, ఆ మహమును నీకొడుకు ధనుర్భంగకారియై పాడుచేసినాడు. ఆ ఉత్సవమును చూడగా ఇంతమంది రాజులు, ఇంతమంది పౌర జానపదులు వచ్చినారు. వారి ఉత్సాహమును నేను ఏమని పాడుచేయను! మల్లురతో యుద్ధమును ఏర్పాటుచేసినాను. నీ బిడ్డడు ఈ నియుద్ధంలో తన విక్రమాన్ని చూపగా, మేనమామను, నేను, సంతోషిస్తాను."

ఇంత చెప్పి కంసుడు రోహిణిదిక్కు మందహాసం చేస్తూ "రోహిణీ! నీవు ఆ రామకృష్ణులకు ఆదిమ శిక్షాగురువవు. వారికి నీ నేర్పిన విద్యలు ఎట్టివో, ఈ మల్లరంగంలో పరీక్షచేస్తాను. ప్రాశ్నికులు వున్నారు. వారు పరీక్ష చేస్తారు. ఇంతమంది ఆరితేరిన యదు భోజ అంధక వృష్ణి వీరులు వున్నారు. వారు పరీక్షచేస్తారు."

అని దేవకి దిక్కు "దేవకీ! నీ బిడ్డ భగవంతుడటమ్మా! భగవంతుడు! అదిగూడా చూస్తాను. అక్కడ చాణూరముష్టికకూటులను చూచినావుగదా! వారితో మీ బిడ్డలకు నియుద్ధం ఏర్పాటు చేస్తున్నాను. తరువాత నన్ను అని పనిలేదు" అన్నాడు. అని విచిత్ర మందహాసం చేశాడు.

"దేవకీ! మాట్లాడవేమి! నన్ను దీవించవేమి!"

"కంస! నీవు నాకన్న పెద్దవు. నన్ను నీవు దీవించవలెను. నిన్ను నేను దీవించరాదు. నీవు సుఖం ఉండు."

ఆమాటలు దేవకి అనగా కంసునకు కృష్ణోత్పత్తి దినం జ్ఞాపకం వచ్చింది. యోగమాయను, శిశువును, దారికను, తాను నేలను వేసి కొట్టగా, ఆమె కాళికియై, తన్ను శపించినరోజు జ్ఞప్తికి వచ్చింది. ఆరోజునగూడ దేవకి ఇదేమాట అన్నది. "కంసా! నీవు సుఖంఉండు" అన్నది. ఆమె ఆమాట అప్పుడు అన్నంతలో తనలో భయము సహస్ర ముఖముల విజృంభించినది. తిరిగి ఇప్పుడు సహస్రముఖముల విజృంభిస్తున్నది. దేవకి ఆమాటలు విని కంసుడు తెల్లబోయినాడు. తెల్లని వెల్గులుగా అతని కన్నులముందు కాళికీదేవి ప్రత్యక్షమైనట్లు వుంది. వికటపదసంఘటనంగా తనహృదయంలో ఘట్టితనాట్య మర్యాదలుపోతూ, ఉగ్రపదసంచారవిశేషాలచేత తన శరీరాణు సర్వస్వాన్ని నొగులుస్తున్నట్లు వున్నది. కంసుడు వివర్ణుడై వెనుతిరిగినాడు. వెనుతిరిగిన కంసుణ్ణి, అతని కన్నతల్లి సంబోధించింది.

"కంస!"

కంసుడు ఆగినాడు. వెనుతిరిగి చూచినాడు. అతడు ఎప్పుడూ ఆ తల్లితో మాటాడి యెరుగడు. తల్లి పిలుపునందలి రుచిని, మాధుర్యాన్ని యెరుగడు. తల్లియందు వైరాన్ని పెంచుకొని, ఆ తల్లి ప్రేమయొక్క మాధుర్యపులోతులను ఎన్నడూ అతడు చవిచూచి ఎరుగడు. ఇప్పుడు ఆతల్లి తన్ను సంబోధించినది. అతడు ఆ పిలుపు విని ఆగినాడుగాని, మారుపలక లేదు.

ఆతల్లి అన్నది: "కంస! నీవునాయందు అకారణవైరాన్ని చేస్తూ వచ్చావు. నీబాధకు కారణం తెలిసినదానిని నన్ను పుత్రులు లేని దానిని చూచినట్లుచూచినావు. పుత్రులు వుండిగూడా నేను వంధ్యను పోలి చివికి పోయినాను. కంస! నీకు ఒకరహస్యం ఇప్పుడు చెబుతాను. నీవు నాజీవిత కళంకం రూపంఎత్తిన మూర్తివి. నేను తల్లిని. నిన్ను సాకినాను. నీయందు పుత్రప్రేమ చేసినాను. నా ప్రేమ వృథాచేసినావు. నేను నిన్ను దీవిస్తున్నాను. నాపుత్రుడవు నీవు వీరుడవు. మహావీరులు పోయిన మార్గంలో నీవు ఉత్తమస్థానాన్ని పొందుతావు."

ఆమె ఇక మాట్లాడలేకపోయినది. ఆమెకంఠం రుద్ధమైనది. ఏదో పిడకల ఒక్కడువచ్చినట్లు ఆమె కళవళం పడిపోయినది. ఆమె మాటలు అక్కడి స్త్రీజనాలకు అర్థంకాలేదు. కంసునకు అర్థం కాలేదు. అతడు తల్లివంక అర్థముకానివాడై చూచినాడు. చూచి వెనుతిరిగి మరలిపోయినాడు. కంసునితల్లి దేవకిభుజముల మీద వాలిపోయినది. ★

# గోరా కుంభార్



తెరఢోకి అను గ్రామమున గోరా కుంభార్ అను ఒక కుమ్మరి వుండెను. అతడు మిగుల భక్తిపరుడు. సంసారము చేయుచున్నను, అతని మనస్సు భగవంతునిలో లీనమై వుండును.

ఒకనాడు గోరా కుండలు చేయుటకు మన్ను తొక్కుచుండగా, అతని భార్యవచ్చి కొడుకును జాగ్రత్తగా చూచుచుండమని చెప్పి తాను నీళ్ళు తెచ్చుటకు వెళ్లెను. గోరా భగవంతుని ధ్యానించుచు మైమరచి నృత్యము చేయుచుండగా అతని కొడుకు ప్రాకుచు వచ్చి కాళ్లకు చుట్టుకొనెను. అతడు వళ్లు తెలియని స్థితిలో నృత్యము చేయుచుండుటచే పిల్లవానిని తనకాళ్ళతో తొక్కుచుండెను. ఇంతలో భార్య వచ్చి కొడుకును వెదకుచు మన్నులో కొడుకు చచ్చిపడి నలిబిలి అగుట గాంచి, ఘొల్లున ఏడ్చుచూ భర్తను దూరుచుండెను. కాని అతనికి ఆమె తిట్లు వినిపించుటలేదు. అతడు భగవధ్యానములో లీనమై వుండెను. వెంటనే భార్య అతని చేయిపట్టుకొని యీవలకు లాగెను. వెంటనే అతనికి తెలివికలిగి భార్యను చూసి 'ఓసీ, రాక్షసీ, నేను పాండురంగనితో ఆనందము ననుభవించుచునుండ నీవు నా భగవధ్యానమును పాడుచేసితివి' అని కోపముతో చక్రము తిప్పు కర్రతో భార్యను కొట్టబోయెను. అంత ఆమె భయపడి 'మీరు నన్ను ముట్టుకున్న పండరీనాధుని ఆన' అనెను. వెంటనే అతడు కర్రను పారవైచి, గతించిన దానిని మరచి భగవంతుని పూజించుచుండెను. భార్యాభర్తలు యిరువది ఒక్కరోజు ఒకరితో నొకరు మాటలాడలేదు. భార్య, భర్త మౌనముగా నుండుటచూచి తానుకూడా మాట్లాడకపోయినచో కాపురము కుదుటపడదని ఆలోచించి, భర్త

జి. రుక్మిణి

కాళ్లు కడుగుటకు నీళ్లు తీసుకువచ్చి కడుగబోయెను. అంత నాతడు 'నీవు నన్ను ముట్టకుము. నీవు పండరినాధునిమీద ఆనబెట్టితివికదా. నన్నేల ముట్టుకొనియెదవు' అనెను. ఆతని మాటలు విని ఆమెకు మిక్కిలి దుఃఖము కల్గెను. ఆమె పుట్టింటికి



పోయి, తన చెల్లెలిని తన భర్తకు యిచ్చి పెళ్ళి చేయవలసినదిగా తల్లిదండ్రులను కోరివచ్చెను. భర్తతో, 'మీరు నా చెల్లెలిని వివాహమాడవలెనని నా కోరిక. అట్లు చేయకపోయినచో వంశము నిలవద'ని యెన్నో విధముల బ్రతిమాలి ఒప్పించి పెళ్లి చేసెను.

గోరా భార్యల నిద్దరను వెంటపెట్టుకొని వచ్చుచుండగా, ఆతని మామగారు గోరాతో 'నీవు యిరువురను సమభావముతో చూసుకోవలెననియూ, అట్లు చూడకపోయిన పాండురంగనిమీద ఆన' అనియూ చెప్పెను. గోరా సంతోషించి 'భగవంతుడే బంధములను విడదీయుచున్నాడని' అనుకొని తన గ్రామమునకు వచ్చెను. ఇరువురు భార్యలకు అన్నవస్త్రములు సమముగా యిచ్చుచుండెనే కాని వారిని మాత్రము స్పర్శించుటలేదు. అందులకు భార్యలు చింతించుచుండిరి. పెద్ద భార్యవచ్చి భర్తనుద్దేశించి, 'నేను పండరినాధునిపై ఆనవుంచినాను కనుక నన్ను ముట్టకపోయిన సరే. కాని నా చెల్లెలు మీకేమి అపకారము చేసినది? దానియందు కూడా మీకు దయలేదా?' అని ప్రశ్నించెను. అంత గోరా, 'నీ తండ్రి మీ యిరువురను సమభావముతో చూచుకోమనియూ, అట్లు చూడకపోయిన

పాండురంగనిపై ఆన పెట్టెను కదా నేనేమిచేయను' అనెను. అది విని భార్య లిరువురును దుఃఖింపసాగిరి.

ఒకనాటి రాత్రి గోరా నిద్రించు చుండుటచూసి అతనిభార్య లిరువురు యిరువైపుల పరుండిరి. వెంటనే ఆతడు మేల్కొని 'ఛీ ఛీ. మీరెంత పని చేసిరి. ఈ అపవిత్రములైన చేతులతో నేను పండరినాథుని ఎలా పూజించను' అని దుఃఖించి, రెండు చేతులను ఛేదించుకొనెను. భార్యలు అదిచూచి దుఃఖించుచుండిరి. గోరా వారిని చూచి 'ఎందులకు ఏడ్చెదరు? అందరిని కాపాడువాడు శ్రీ విఠల్ నాథుడున్నాడుకదా. ఆ దేవుని ప్రార్థింపు' డనెను.

ఒకనాడు గోరా తన భార్యలను పండరీక్షేత్రమునకు తీసుకొని పోయెను. అక్కడ భక్తులు నృత్య గీతములతో భజనలు చేయుచుండిరి. గోరా మనస్సులో 'అయ్యో, నాకు చేతులు లేకపోయెనే. నేనుకూడా తాళములతో భజన చేసెడివాడను కదా' అని బాధకల్గి భగవంతుని ధ్యానములో నిమగ్నుడయ్యెను. అంత పండరినాథునకు దయకల్గెను. వెంటనే గోరాకు చేతులువచ్చెను. అతడు తాళమువేయుచు నృత్యము చేయుట అక్కడివారందరు చూచి ఆశ్చర్యపడిరి. భార్యలిద్దరూ ఆవింత చూసి 'పాండురంగా మేమేమి పాపము చేసితిమి? మా భర్త చేతులు యిచ్చితివి. మా కుమారుని కూడా మాకు ప్రసాదించుము' అని ధ్యానించుచుండిరి. అంత పండరి నాథునకు దయకలిగి ఆనాడు మట్టిలో కలిపి తొక్కిన కుమారుని తీసుకువచ్చి వారికిచ్చి గోరాతో 'నీభార్య నాపై పెట్టిన ఆనయూ, నీమామ నాపై యుంచిన ఆనయు యికమీదట నీకు లేవు. కావున నీవు భార్యలతో సుఖింపుచు కాలము గడుపుతూ నన్ను ధ్యానించు చుండుము. నీకేమియు కొరతలేద'ని చెప్పి అదృశ్యుడయ్యెను. అక్కడ వున్న భక్తజనులకు అపరిమితా నందము, ఆశ్చర్యము కలిగి గోరాను వేయినోళ్ల బొగడిరి. గోరా భార్యలతో కలసి భగవంతుని పూజింపు చుండెను. ★

పోలీసులకు శిక్షణ ఇచ్చే అధికారి ఒకరిని పిలిచి ఇలా ప్రశ్నించాడు:

"మనకు ఉపయోగపడే చెయ్యి ఏది?"

"కుడిచెయ్యిసార్" అన్నాడు పోలీసు.

"ఎందుకు?"

"సెల్యూట్ చేయడానికి సార్."

—ఆరాధ్యుల నారాయణమూర్తి
(చెన్నూరు)




చిత్రకారుడు: ఎస్. రఘురామారావు (విల్లివాక్కం)

# వరాలిచ్చే వృక్షం

అది బోర్నియో సమీపాన్ని గల ఒక చిన్న పల్లెటూరు. ఆ ఊరికి చివర ఒక చిన్న గుడిసె. అందులో ముగ్గురు బాలిక లున్నారు. వారి తల్లీ, తండ్రీ కూడా చనిపోయారు. వారి కున్న బంధువల్లా ఒక మామయ్యమాత్రమే. కాని అతను చాలా క్రూరుడు. దురాశాపరుడు. వాడు ఆ పిల్లలకు రోజుకు ఒక్కసారే అన్నంపెట్టేవాడు. అదయినా, ఒక్కరికి సరిపడ ఇచ్చి, దాన్నే ముగ్గుర్నీ తినమనేవాడు.

పంటలకోతలరోజులలో వాళ్లను చావగొట్టి పనిచేయించేవాడు. వాళ్లు అలసిపోగా చూసి గొడ్లను బాదినట్లు బాది, "మీరు వట్టి సోమరి వాళ్ళు. మీరు ఏమాత్రం పనిచేయక పోయినా, ఈరోజు మీకు ఒక్క మెతుకు కూడా చూపించను" అనే వాడు.

ఈ మాటలు, పక్షిరూపంలో ఎగిరిపోతూన్న ఒక అందమయిన దేవత విన్నది. ఆ పిట్టను "కే-కే-కో"అని పిలుస్తారు. ఆ దేవత, ఈ బాలికల్ని చూసి, చాలా జాలిపడింది. మూర్ఖుడైన మామయ్య మాటలను విన్నది. సాయంత్రం బాలికలు పొలంవదిలి ఇంటికి పోయే వరకూ ఒక చెట్టుకొమ్మమీద కూర్చుంది. సాయంత్రం చెట్టుమీద నుంచి గెంతుతూ కూస్తూ ఆ పిల్లల దగ్గరగా వచ్చింది.

"ఎంత అందమయిన పక్షి!" అని అరిచింది అందరికంటే చిన్నపిల్ల,

"కే-కే-కో పిట్టా! నా దగ్గరకు రావూ?" అంది పెద్దమ్మాయి. ఆమె ఈ మాటలు పూర్తిచేసిందో లేదో, కే-కే-కో పిట్ట ఎగిరివచ్చి పెద్దపిల్ల భుజంపై వాలింది.

"నేను మాతో బాటు ఇంటికి తీసుకువెడతాను"అంది పెద్దపిల్ల.

"చాలా సంతోషం" అన్నట్టుగా కూసింది కే-కే-కో.

"అది మనతో ఉంటానంటోంది" అన్నది రెండోపిల్ల.

---

మలపాక పాండురంగ

---

"అవునవును" అన్నట్లుగా కూసింది పిట్ట.

"అది 'అవును' అంటోంది— నాకు బాగా తెలుసు" సంతోషంతో చప్పట్లు కొట్టింది చిట్టిచెల్లెలు—

* * *

బాలికలు ముగ్గురూ దాన్ని ఇంటికి తీసుకుపోయి, ఒక పాత పంజరంలో పెట్టారు. దానికి తిన డానికి బెర్రీ పళ్లూ, గింజలూ, పెట్టేవారు. వారు తినే ఆహారంలో దానికికూడా పాలుపంచే వారు. కొన్నాళ్ళకు ఆ పిట్ట వాళ్ళకు ఒక పెద్ద స్నేహితుడైపోయింది. ప్రతీసాయంత్రం పిల్లలు పొలంనుంచి రాగానే వారికి స్వాగత మిచ్చేది. సంతోషంతో కూతలు పెట్టేది. వాళ్ళు, తనను తనపేరుపెట్టి పిలిస్తే ఎంతో సంతోషించేది.

'కే-కేకో, కే-కే-కో"అని అరచే వారు పిల్లలు.

"కే-కే-కో" జవాబిచ్చేది పిట్ట; "కే-కే-కో, కే-కే-కో."

ఒంటరిగా ఉండే బాలికలకు ఇల్లంతా సంతోషంతో నింపేది ఆ పిట్ట—

* * *

ఒకనాటిరాత్రి. చంద్రుడు పూర్తిగా వికసించాడు. అతని చల్లని కిరణాలు, కిటికీగుండా లోనికి ప్రవహిస్తున్నాయ్. అందరికంటె పెద్ద పిల్లకు మెలకువవచ్చింది. ఎవరో తనను పిలుస్తూన్నట్లనిపించింది. ఆపిలుపు పంజరంనుంచివస్తున్నట్లుగా ఉంది. మొదట కలగంటున్నానేమో అనుకుంది. పరుపుపై పడుకొని మళ్ళీ జాగ్రత్తగావింది. అపుడు మళ్ళీ ఒక శబ్దంవినబడింది— తియ్యటికీచుశబ్దం— కాని అదేమిటో మొదట ఆమెకు అర్థంగాలేదు.

"నువ్వా నాతోటి మాట్లాడుతున్నావా కే-కే-కో?" అనడిగింది.

"అవునవును" పక్షి జవాబిచ్చింది, "చంద్రుడు తెల్లగా ప్రకాశించి నపుడు నేనుమాట్లాడుతాను."

బాలిక సంతోషం పట్టలేక చప్పట్లు చరిచింది.

"ఓహ్! నాకు చాలాసంతోషం" అన్నది. పక్షి మళ్ళీఏదో మాట్లాడు తోంది—

"ఏమిటి చెబుతోంట నా తియ్యటి కే కే-కో?" అనడిగింది బాలిక.

"నా పంజరం దగ్గరకు రా!" కీను మంది పిట్ట. తన పక్కను వదలి పంజరందగ్గరికి పరుగెత్తుకెళ్ళింది.

"చిట్టితల్లీ! పంజరాన్ని తెరు," కీచుమంటూ చెప్పింది పిట్ట. "నేను దూరంగా ఎగిరిపోవాలి."

"నువ్వు వెళ్ళిపోతానంటే నా కెంతో విచారంగాఉంది. మేమందరం నీకోసం ఏడుస్తాం" అన్నది ఆబాలిక. కళ్ళనుంచి కన్నీళ్ళు ప్రవహించాయ్. కాని పక్షిమాటకు ఎదురుచెప్పలేక పోయింది. అందుచేత పంజరాన్ని తెరిచింది.

అపుడు పక్షి చెప్పింది: "నన్ను హాయిగా వదలినందుకు మీ కొక బహుమతి ఇస్తాను. రెండు ఖాళీకుండలు ప్రతిరాత్రి మీనిప్పు కొలిమి వద్ద ఉంచండి. నేను మీకోసం ఆహారం తెస్తాను. మీకు చాలినంత ఆహారంలేదని నేను చాలా విచారిస్తున్నాను."

అపుడు పక్షి కిటికీలోంచి తుర్రుమంది. బాలిక రెండుఖాళీకుండలు ఉంచి తన పరుపువద్దకు చేరుకుంది.

* * *

మరునాటి ఉదయం—పక్షి లేనందువల్ల ఇల్లు చాలా నిశ్శబ్దంగాఉంది. ఒంటరితనంగానూ ఉంది.

"కే-కే-కో" ఏదీ?" అనడిగింది కంగారుగా చిన్నపిల్ల—

"అవును నిజమే," అన్నది రెండోసోదరి. "అది ఎగిరిపోయింది."

వాళ్ళందరూ చాలా విచారించారు. అందరికంటే ఆఖరి చెల్లెలు, "నాకు చాలా ఆకలిగా ఉంది"అంది.

"నాకుకూడా ఆకలిగానే ఉన్నది!" అన్నది రెండవపిల్ల.

"నా కడుపును ఎలకలు దొలిచేస్తున్నాయ్" పెద్దపిల్ల తిక్కమొహం వేసింది. "కాని నా కెక్కడనుంచో




"పుట్టింటినుంచి వచ్చిందోయ్, మా ఆవిడ"

చిత్రకారుడు—ఎమ్. వెంకటేశ్వరశాస్త్రి (జగ్గయ్యపేట)

మంచిమంచి కూరల ఘుమఘుమ వస్తోంది."

అందరూ పక్కలమీంచి లేచారు అక్కడ నిప్పుకొలిమి (ఫైర్ ప్లేస్)వద్ద రెండుకుండ లున్నాయ్. రెండూ కూడా తాజాగావండిన ఆహారపదార్థములతో నిండి ఉన్నాయ్.

"మనకోసం ఎవరు తెచ్చారీ ఆహారం?" అని చిన్నపిల్లలిద్దరూ అడిగారు.

"కే-కే-కో." పెద్ద అక్కగారు సమాధాన మిచ్చింది. అపుడామె క్రితంరాత్రి జరిగిన దంతా చెప్పింది.

పిల్లలు వారి కర్రగిన్నెలనిండా కావలసిన ఆహారం నింపుకున్నారు. అన్నమూ, చేపలూ వేసుకున్నారు. వారు తమజీవితాల్లో ఎన్నడూ ఇంతటి తియ్యటి ఆహారాన్ని తినలేదని అనుకున్నారు.

ప్రతిఉదయం, ప్రతిసాయంత్రం వారు కుండల చేపలుతోనూ, అన్నంతోనూ నిండిఉండడం చూసేవారు—కొన్నాళ్ళకు వారివిచారం పోయింది. తాము బలంగానూ, శక్తిగానూ పెరుగుతోన్నట్లు గ్రహించారు. కే-కే-కో ప్రతిమధ్యాహ్నం, ప్రతి రాత్రి వస్తూపోతూఉండేది. ఒక్కొక్కప్పుడువాళ్లు దాన్నిచూసేవారు, లేనప్పుడులేదు. పక్షి ప్రతిసారీ బోలెడంత ఆహారం ఇచ్చేది. నిజానికి ఆ రెండు కుండల అన్నం, ముగ్గురూ తినలేకపోయేవారు. రాత్రి భోజనానికి వాళ్ళ స్నేహితుల్ని పిలుస్తూ ఉండేవారు.

దురదృష్టవశాత్తూ ఈ సంగతి వాళ్ళ, ముసలిమామయ్యకు తెలిసింది. వాళ్లు కావలసినదానికంటే ఎక్కువే ఆహారాన్ని సంపాదిస్తున్నట్లు తెలుసుకున్నాడు. ఊళ్ళో చాలామందిని వాళ్ళకు ఆహారం ఎవరిస్తున్నారని అడిగాడు. కాని ఎవరూ చెప్పలేకపోయారు. అతడు పిల్లల ఇంటికి వెళ్లాడు. పెద్దపిల్లను, "అంతఆహారం మీకు ఎక్కడనుంచి దొరుకుతోంది?" అనడిగాడు.

ఆపిల్ల కే-కే-కో పక్షి రోజుకు రెండుసార్లు కుండల నిండా ఆహారాన్ని, చేపలను నింపుతోన్నట్టు

చెప్పింది.

ఇది వినగానే, దురాశాపరుడైన ఆ మామయ్యకు ఒక దురాలోచన తట్టింది. ఒకమనిషిని కే-కే-కోను పట్టుకొనటానికి నియమించాడు పిల్లలకు తెలియకుండా. పక్షి ఇంట్లో ప్రవేశించగానే వాడు దాన్నిపట్టుకొని మామయ్యనద్దకు తీసుకుపోయాడు.

"ఇప్పుడు" పక్షిని చూడగానే మామయ్య అన్నాడు, "కే-కే-కో నాకు ఆహారం తీసుకొస్తుంది."

అతడు ఒకబలిష్ఠమైన పంజరంలో పక్షిని బంధించాడు. రెండు ఖాళీ కుండలు నిప్పుకొలిమివద్ద ఉంచాడు.

కాని మరునాడు ప్రొద్దున్న లేచి పక్షి తన కేమీ తేలేదని తెలుసుకున్నాడు. అతనికి చాలా కోపం వచ్చింది. పంజరం తెరుస్తూనే కే-కే-కో కంఠంపట్టుకొని బయటకు ఈడ్చాడు. పీక నులిమేశాడు ... నిష్ఠాురంగా కే-కే-కోను చంపేశాడు! దాని అందమైన, సున్నితమైన, ఈకలను పీకాడు. తరువాత దాన్ని ఒక కుండలోవండి, తిన్నాడు. తరువాత ఆపక్షియొక్క ఎముకల్ని, బొమికల్ని దొడ్లోకి విసిరేశాడు.

* * *

కొన్నిరోజులు దొర్లిపోయాయి. పెద్దపిల్ల ఆమె మామయ్యవద్దకు వెళ్ళి, "మా కెక్కడా ఆహారంలేదు. మీ మనిషి దొంగిలించిన మా 'కే-కే-కో'ను ఇయ్యవూ?" అని అడిగింది.

మామయ్య, "పక్షిని నేనుతినేసి, బొమికల్ని దూరంగాపడేశా" అన్నాడు దొడ్డివైపుచూపిస్తూ.

పాపం! ఆ బాలిక చాలాసేపు ఏడ్చి, ఆ బొమికల్ని ఏరుకొని తన యింటికి వెళ్లిపోయింది. తనమామ చేసినపనంతా తన చెల్లెళ్ళతో చెప్పింది. వాళ్ళుకూడా చాలాసేపు ఆ బొమికల్ని చూసి ఏడ్చారు. ఆఖరికి వాటిని తమయింటివెనుక జాగ్రత్తగా సమాధి చేశారు.

# వరాలిచ్చే వృక్షం

మరునాడు వాళ్ళు బెర్రీపళ్ళు వెతకటాన్కి-యింటివెనక్కు వెళ్లారు. అక్కడ దృశ్యంచూచి వాళ్లు చాలా ఆశ్చర్యపడ్డారు. ఒక అందమయిన పొడుగుపాటిచెట్టు, కే-కే-కో సమాధినుంచి మొలిచింది. అది చక్కటి పువ్వులతోటి పండ్లతోటినిండివుంది. దానిఆకులు సిల్కుతో చేయబడినట్లున్నయ్. ఆ పిల్లలు ఆ చెట్టెక్కి పండ్లను కోసుకుతిన్నారు. అవిచాలా మధురంగానూ, పుష్టికరంగాను ఉన్నయ్—ఒక్కొక్కపుడు పండ్లు కొమ్మలనుంచి కోస్తుంటే తియ్యటి కూతలాంటిది వినవస్తోంది. ఆకూత సరిగా కే-కే-కో కూతలాగేఉంది.

అపుడు వారు 'కే-కే-కో' ఆ చెట్టుయొక్క దేవతనియు, ఇప్పటికీ తమనుగురించి జాగ్రత్తవహిస్తోందనియు తెలుసుకున్నారు. వారిలో ఒకపిల్ల, ఒకపండునుకోసింది. అది చాలా మధురంగా ఉంది. దాని ప్రక్కనేఉన్న ఒకపువ్వునుకోసింది. కాని అందులో మెరుస్తూన్న వజ్రం కనబడింది. ఆమె చాలా ఆశ్చర్యపడింది. మిగిలిన ఇద్దరూ కూడా పువ్వులు కోశారు. వాటిల్లోకూడా వజ్రాలున్నాయ్!

"అన్ని పువ్వులలోనూ వజ్రాలున్నాయా?" అన్నది పెద్దపిల్ల. వెంటనే చెట్టుమొదలులోంచి కే-కే-కో శబ్దం వినబడింది.

"నేను మీకు ఆహారం, ఐశ్వర్యం ప్రతిరోజూ ఇస్తాను. నావరములు మీకు స్నేహితుల్ని తీసుకువస్తాయ్" అని వినబడింది—

ఆవిధంగా ప్రతిరోజూ ఆ బాలికలు రోజూ మూడు వజ్రాలను సంపాదించేవారు. కొంతకాలంలోనే వారు చాలాధనవంతులైపోయారు.

ఈ అద్భుత వృక్షంకథ, ఆ దేశపు రాజు విని, దానిని చూడడానికి వచ్చాడు. క్రూరుడైన వారి మామయ్య ఆ ధనాన్ని కాజేస్తాడనే భయంతో, అతన్ని ఆ దరిదాపులకు రాకుండా కట్టుదిట్టం చేశాడు. వాళ్ళను దయగా ప్రేమగా చూడడానికి, ఒక ముసలిస్త్రీని కూడా పంపించాడు. ఆ తర్వాత చాలా సంతోషంతో జీవించారు పిల్లలు. వారు చెట్టునుంచి కొన్నివందల వజ్రాల్ని సంపాదించి చాలా ధనవంతులయ్యారు. అందుచేత ఆ అద్భుతవృక్షం క్రమంగా క్షీణించసాగింది. ఎందుచేతనంటే, ఇకముందు వారికి సహాయపడవలసిన అవసరం లేదు ఆ దేవతకు. ఏ దేవత అయితే కే-కే-కో పక్షిరూపందాల్చి కష్టాలలోఉన్న ఆ ముగ్గురు బాలికలనూ రక్షించేదో, ఆ దేవతపని అయినది కనుక, ఆ అద్భుతవృక్షరూపంనుంచి విముక్తి పొందడానికి క్రమంగా క్షీణించి, నశించింది. ★

# సినిమా

## వార్తాభరణం

చౌ చౌ

అమెరికా ఎన్నికల ప్రచారంలో హాలీవుడ్ తారలు గ్రేస్‌కెల్లీ (ప్రిన్సెస్ గ్రేస్), జూడీ గార్లాండ్ – మున్నగువారు ముమ్మరంగా పాల్గొంటున్నారు. వీరంతా అధ్యక్షపదవికి పోటీచేస్తున్న కెనెడీకి పూర్తి చేయూత నిస్తున్నారు. వీరిలో కెనెడీసోదరి జాక్ కూడా ఈ ప్రచారంలో పాల్గొంటున్నది. వీరుకాక పీటర్ లాఫర్డ్, హెన్రీ ఫాండా, శామీ డేవిస్, కూడా కెనెడీకి ప్రచారం చేస్తున్నారు

రిపబ్లికన్‌పార్టీ అభ్యర్థి నిక్సన్‌తరఫున జేమ్స్ స్టూవర్టు, గారీకూపర్, జేమ్స్ కాగ్నీ, ఫ్రెడ్ మాక్‌ముర్రే, కర్క్ డగ్లస్, జెర్రీలూయిస్, షెర్లీ టెంపుల్, డిక్‌పావెల్ ప్రచారం చేస్తున్నారు.

తారసాయిని బట్టి ప్రజాభిప్రాయం ఎటు మొగ్గుతుందో ఎవరికీ తెలియడం లేదు.

* * *

ఉత్తమ్‌కుమార్, అజయ్‌కర్‌లు సమిష్టిగా నిర్మిస్తున్న 'సప్తపది' (బెంగాలీ) లో ఉత్తమ్‌కుమార్, సుచిత్రాసేన్‌లు ప్రధాన పాత్రలు వహిస్తున్నారు

ఫిబ్రవరిలో ఈ చిత్రం పూర్తి కాగానే సుచిత్రాసేన్ విదేశయాత్రకు వెడతారు. ఏప్రిల్‌లో తిరిగి రాగానే సత్యజిత్ రాయ్ చిత్రం 'దేవీ చౌధురానీ' లో నాయిక పాత్ర ధరిస్తారు.

* * *

'ఏ రస్తే ప్యార్ కే' కేవల్‌కపూర్ నిర్మిస్తున్న చిత్రం సునీల్ దత్, లీలానాయుడు ప్రధాన భూమికలు ధరిస్తున్నారు అశోక్‌కుమార్, మోతీలాల్, రెహమాన్, విజయలక్ష్మి, దివాన్‌షరార్, కూడా నటిస్తున్న ఈ చిత్రానికి సంగీత దర్శకుడు రవి. దర్శకుడు ఆర్ కె నయ్యార్.

* * *

సుబీరాజ్, విజయా చౌధురీ, షేక్ ముఖ్తార్, జయంత్, ముక్రీ, సునీత నటిస్తున్న కె. అమరనాథ్ చిత్రం 'బడా ఆద్మీ' శీఘ్రవేగంతో పూర్తి అవుతున్నది. సంగీతం చిత్రగుప్త.

* * *

దినూదేశాయ్ నిర్మిస్తున్న 'జిందగీ ఔర్ బాబ్'లో మీనాకుమారి, రాజేంద్రకుమార్ నాయికా నాయకులు. దత్తారాం సంగీత దర్శకుడు.

ఫిల్మ్‌యుగ్ వారి 'ఆస్ కా పంఛీ' చిత్రంలో వైజయంతీమాల, రాజేంద్రకుమార్, రామిందర్, లీలాచిట్నీస్, నజీర్ హుసేన్, రాజ్ మెహరా నటిస్తున్నారు. మోహన్‌కుమార్ దర్శకుడు. శైలేంద్ర, హస్రత్ జైపురీ రచన. శంకర్ జైకిషన్ సంగీతం.

* * *

చంద్రా ఫిలిమ్స్‌వారి 'సుహాగ్ సిందూర్' బొంబాయి సెంట్రల్ స్టూడియోస్‌లో తయారవుతున్నది బాల్‌రాజ్ సాహనీ, మాలాసిన్హా, మనోజ్, జానీవాకర్ ఇందు నటిస్తున్నారు. చిత్రగుప్త సంగీతం, కృషన్, పంజా దర,



రోహిణీవారి 'గంజదొంగ' ద్విభాషా చిత్రంలో కథానాయకుడు ఎన్. టి. రామారావు.



విఠల్ ప్రొడక్షన్స్ వారి "కనకదుర్గపూజామహిమ"లో నాయకీ, నాయకులు-కృష్ణకుమారి, కాంతారావు.

## వార్తాభరణం

కత్వం ఈ చిత్రంలో ప్రత్యేకత.

* * *

అన్నపూర్ణా పిక్చర్స్‌వారి ఆరవచిత్రం (నామకరణం జరుగలేదు) చాలా వరకు పూర్తి అయింది. నాగేశ్వరరావు, జగ్గయ్య, రేలంగి, రంగారావు, సావిత్రి, గిరిజ, సూర్యకాంతం మున్నగువారు నటిస్తున్న ఈచిత్రానికి దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు, సంగీతం పెండ్యాల నాగేశ్వరరావు. సంక్రాంతి ప్రాంతాల విడుదల చేస్తామని నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు వెల్లడించారు.

* * *

శ్రీ రామా (భక్త అంబరీష) పిక్చర్స్ వారు తమ రెండవచిత్రం 'దేశద్రోహులు' వాహినీ స్టూడియోలో అక్టోబర్ 24 నుంచి ప్రారంభించారు.

మాటలు గిరిరాజ్, పాటలు బైరాగి, ఆరుద్ర, సంగీతం రాజేశ్వరరావు, కళ-ఎస్. వి. ఎస్. రామారావు నిర్వహిస్తున్నారు. ఎన్. టి. రామారావు, కాంతారావు, రేలంగి, రమణారెడ్డి, రాజనాల, దేవిక, గిరిజ, రాజశ్రీ, కుటుంబరావు, మిక్కిలినేని, పెరుమాళ్ళు, రామకృష్ణ మున్నగువారు నటిస్తున్నారు. సంగీత రాజేశ్వరరావు అతిథి నటులుగా ఇందులో పాల్గొంటారు.

నిర్మాత, దర్శకుడు బోళ్ళ సుబ్బారావు.

* * *

చిత్రలోకంలో గొంతు విప్పిన మరో వసంత కోకిల శ్రీమతి-ముక్కామల సునంద 'చివరకు మిగిలేది'- నవశక్తివారి ద్వితీయ చిత్రం — ఈ రెంటిలోనూ ఈ నవగాయని కమ్మని గీతాలు పాడింది. కర్ణాటకసంగీతంలో 'విద్వాన్', హిందీలో 'విశారద' అయిన సునంద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ వ్యవసాయ శాఖలో పనిచేస్తున్న శ్రీ ముక్కామల శ్రీహరిరావుగారి పుత్రిక.

* * *

బిమల్ మిత్ర బెంగాలీలో రచించిన ఒకానొక ప్రసిద్ధనవలను నిర్మాత, దర్శకుడు గురుదత్ తెరకు అనువదించబోతున్నారు. ఈ వారములో షూటింగ్ ప్రారంభమౌతుంది. గురుదత్ దర్శకత్వం వహించే యీచిత్రంలో ఎవరెవరు నటించగలరో ఇంకా తెలియలేదు కాని వహీదా రెహమాన్ మాత్రము తప్పకుండా వుంటుందని అంతా అనుకుంటున్నారు

* * *

తమిళంలో వాసు ఫిలింసువారు నిర్మించిన "కైరాసి" తెలుగులో కూడ నిర్మిస్తున్నారు. ఎన్. టి. రామారావు, బి. సరోజాదేవి, రేలంగి, ఎస్. వి. రంగారావు, గుమ్మడి కన్నాంబ, రాజనాల యీ చిత్రంలో నటిస్తారు. హిందీలో కూడ యీ చిత్రం తీయ సంకల్పించారు. దేవానంద్, సరోజాదేవి ప్రధాన పాత్రధారులు. దర్శకత్వం కె. శంకర్.

* * *

లండన్ ఫిలిం ఫెస్టివల్‌లో సత్యజిత్ రాయ్, "పథేర్ పాంచాలి" చిత్రత్రయానికి విన్నింగ్‌టన్ ఫిలిం ఎవార్డు ప్రత్యేకంగా బహూకరించబడినట్లు పశ్చిమ బెంగాల్ ప్రభుత్వానికి వర్తమానం వచ్చింది.

* * *

రాల్‌హన్ ప్రొడక్షన్స్‌వారి "గేందాస్" చిత్రంలో మాలాసిన్హా, రాజేంద్రకుమార్ నాయికానాయకులు. రవి సంగీతం; ఓ. పి. రల్హాన్ దర్శకత్వం వహిస్తారు.

# వగైరా వగైరా

## గిరిజ సరదాలు

'సరదాగా ఉండటం కన్న సరదా నాకింకోటి లేదు నా వరకు నాకు కొందరు ఎందుకు ఎప్పుడూ ఏమిటోగా వుండి బాధ పడుతూంటారో తెలీదు తెలుసుకోవాలని ఉంది'—అన్నారు సినీతార గిరిజ.

'ఆశలేని జీవితంలో తీపి లేదు. తీపిలేని జీవితంపై ఆశకూడా వుండదు ఆశించటం కూడదనే వేదాంతం నాకు గిట్టదు. వేదాంతం ఆచరణసాధ్యమయిన బోధ చేస్తేగాని నాకు రుచించదు' అని ఆమె నిర్వేదంతో పలికినప్పుడు సినీగిరిశిఖరం పైకి ఆరోహించాలని ఆమె కనే కలలు కళ్ళలో మిలమిల లాడాయి.

ఎవరిబాగు వారు కోరుకుంటే హానిలేదనీ, అది మరొకరిని చెరపనంత వరకు విచారించవలసిందేమీ ఉండదనీ తనకు తనో వేదాంతం చెప్పుకుని ముందడుగు వేస్తున్నారు గిరిజ.

## జర్నలిస్టు నాగేశ్వరరావు...

ఒకానొక ప్రసిద్ధ సచిత్ర వార పత్రిక కార్యాలయం. ఆ కార్యాలయం



డి. బి. యస్. 'పెండ్లిపిలుపు'లో నాయిక దేవిక.



శ్రీరామా పిక్చర్సువారి "దేశద్రోహులు" ప్రారంభోత్సవ సందర్భములో తీసిన ఛాయాచిత్రము. కుడినుంచి ఎడమవైపుకు: శ్రీ ఎస్. రాజేశ్వరరావు, ఎన్. టి. రామారావు, కాంతారావు.

ముందు కార్మికులంతా చేరి పెద్దపెట్టున ఏదో ఆందోళన చేస్తున్నారు. జర్నలిస్టులూ చాలామంది ఉన్నారు. మంచికి పోతే వంచన జరిగినట్టుంది. రచ్చకెక్కి రట్టుచేస్తున్నట్టున్నారు వాళ్ళంతా. ఆ ఆందోళన లోంచి, బిరబిర వచ్చిన కొరుదిగి చరచర నడిచి వచ్చాడు ఒక యువకుడు. ఆ సమయంలో అందరిదృష్టీ ఆ యువకుడి మీద పడింది. అతనిముఖం కందగడ్డలా పౌరుషంతో నిండి ఉంది ఆ వచ్చిన యువకుడు అందరినీ కలయ చూసి ఏదో చెప్పబోతూండగా 'కట్' అనడం జరిగింది.

ఆ యువకుడు జర్నలిస్టా, కార్మికనాయకుడా అని తర్కవితర్కాలు జరుగుతుండగా 'అవునండీ నేను జర్నలిస్టునే వృత్తి అది కాకపోయినా ప్రవృత్తి అదే' అన్నారు అక్కినేని నాగేశ్వరరావు.

ఇది విజయాస్టూడియోలో అన్నపూర్ణా వారి అరవచిత్రం సెట్టుమీద ఘట్టం. యువకుడుగా నాగేశ్వరరావు నటించారు.

*　　*　　*

మధుర గాయకుడు పి బి శ్రీనివాస్ తన సోదరి చి॥ సౌ॥ సీతాలక్ష్మిని, చి॥ రంగనాథ్ (మద్రాసు హైకోర్టులో న్యాయమూర్తిగా పనిచేసిన కీ. శే. వింజమూరి గోవింద రాజాచారిగారి కుమారుడు) కు ఇచ్చి అక్టోబరు 26 న వైభవంగా వివాహం జరిపించారు మద్రాసు, లాయడ్స్ రోడ్ లోని సత్యాగ్రహ భవనంలో జరిగిన ఈ వివాహానికి మద్రాసు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నార్, శ్రీ వి. ఎస్. పి. అయ్యర్, నగరంలోని పలువురు ప్రముఖ న్యాయవాదులు, చలనచిత్ర దర్శకులు, నిర్మాతలు, సంగీత దర్శకులు ముహూర్తానికి వచ్చి వధూవరులను దీవించారు. మర్నాడు సాయంకాలం విందు, గానసభలు జరిగాయి. తెలుగు సినిమా ప్లే బాక్ గాయకులు రాజేశ్వరరావు, ఘంటసాల, పిఠాపురం నాగేశ్వరరావు, లీల, సుశీల, జానకి మొదలగువారంతా పాడారు. తరువాత వైణిక శిఖామణి ఈమని శంకరశాస్త్రిగారి గాన సభ జరిగింది. మద్రాసు ఎ. కణ్ణన్ మృదంగం వాయించారు.

## తెరమీద జీవితాలు!

మానవ మస్తిష్కంలో కలిగే భావాలూ పుట్టబొమ్మలూ మరేజంతువుకూ కలగవనీ, అసలు జంతువులకు మేధస్సు లేదనీ శాస్త్రవాదం. దానిమాట ఎలాఉన్నా కలిగే భావం కాని, ఏర్పడే బొమ్మకాని వ్యక్తం చేయగల, శాశ్వతంగా రచించుకుని నలుగురికోసం దాచగల ప్రజ్ఞ మానవుడికిమాత్రమే వుంది.

వంగదేశపు మహామేధావి, నవలాకారుడు విభూతి బెనర్జీ ఇందుకొక నిదర్శనం ఆయన అనుభవంలో చూసింది చుట్టుపట్ల జీవితాలు. వ్రాసిందికూడా తన పరిసరాలూ, జీవితాలే. అంతేకాని కృత్రిమమైన ఏవో కట్టుకథలు కావు. తనకు సృష్టిరహస్యం, కాలగమనం, జీవితసత్యం – ఏమిటో తెలియచెప్పిన

కావ్యాలు ఆ జీవితాలే. అవి ఆయనహృదయ ఫలకలమీద హత్తుకుపోయినాయి. యథాతథంగా, కృత్రిమత తగలకుండా, నిర్మలంగా ఆ జీవితాలను రచించాడు విభూతి బెనర్జీ. వాటిని దృశ్య కావ్యాలుగా చిత్రించాలనే కాంక్ష, ఆశ, అంతకుమించిన ఉత్కంఠ సత్యజిత్ రాయ్‌కి కలిగింది. పర్యవసానంగా పథేర్ పాంచాలీ-

## తెరమీద జీవితాలు!

చిత్రత్రయంగా అపరాజితో, అపూర్ సంసార్ లతో కలిపి ఆధునిక మహాభారతమని చెప్పకోదగిన మూడు చిత్రాలూ తీశాడు.

'పథేర్ పాంచాలీ' మరోసారి మద్రాసు సాహనీస్ థియేటర్ లో నవంబరు 6 వ తేదీని ప్రదర్శించారు.

మున్నెన్నడూ రానంతమంది ఈసారి ఈ చిత్రం దర్శించడానికి వానలో కూడా వచ్చారు. పథేర్ పాంచాలీ చిత్రాలకు అంతర్జాతీయంగా లభించిన గౌరవాదరాలు, అవార్డులు, ప్రశంసలూ బహుశః మన ప్రేక్షకులలో ఈ చిత్రాలపట్ల ఆసక్తి కలిగించి వుంటాయని, లేకపోతే ఇంతమంది జనం







ఈ చిత్రం చూడటం జరగదని విజ్ఞులు అనేకులు అభిప్రాయపడ్డారు.

ఈ చిత్రంలో బాక్సాఫీసు హిట్లర్ల శక్తియుక్తులుగాని, పంచరంగుల పంచారింపులుగాని, చిత్రగీతుల విచిత్ర రీతులుగాని, మనుషులు చేసి ఆనందించకపోయినా చూసి ఆనందించే అసభ్యపు (అప) హాస్యంగాని, ప్రేమ పాఠాలుగాని మచ్చుకు కనిపించవు. తెగ మొహాలు తగిలించే మేకప్పులూ, అవి నివసించే కృత్రిమ కళానిపుణత వెల్లివిరిసే సెట్స్ గాని అంతకుముందే లేవు. వ్రాసి చదువుకుని బట్టీ పట్టి హావభావాలు ఒలకబోస్తూ గడగడా చెప్పే సంభాషణలు లేవు.

ఇవన్నీ లేని చిత్రం చిత్రం కాదని, జీవితమని తెలుసుకున్న పాశ్చాత్యులు సత్యజిత్ రాయ్ అపూర్వకృషికి జోహారులర్పించారు. ఆవిధంగా మనం గుర్తించలేని మహిమను గుర్తించి మనకు మార్గదర్శకులైనారు.

భారతీయ సంస్కృతీ సౌరభం మనం కట్టుకున్న కట్టుకథల్లోనూ, బట్టీ పెట్టిన పట్టుకు ముక్కల్లోనూ లేదని, మనజీవితాల్లో, మన అనుభవాల్లో భావాల్లోనే ఉందనీ ఈ చిత్రం మనకు బోధిస్తుంది. అందుకు తానే సాక్ష్యంగా నిలుస్తుంది.

సత్యజిత్ రాయ్ చిత్రాలు మన ఆపేక్షలూ మన అంతరంగాలూ, అనురాగాలూ ఎంత గూఢమో, గాఢమో ప్రతిబింబించే దర్పణాలు. ఇవి చూడవలసిన అవసరం ప్రేక్షకులకూ, చూపవలసిన బాధ్యత థియేటర్ల యాజమానులకూ ఎంతైనా వుంది. ఈ బాధ్యత గుర్తించినవాడు అది వారికొక యోగ్యత కాకపోదు.

## సౌందర్య మహల్ లో 'కులంలేనిపిల్ల'!

ప్రిని శెట్టి రచన 'కులంలేనిపిల్ల' నాటకాన్ని, చెన్నపురి ఆంధ్ర మధిరాజ సంఘం వారు, బీదవిద్యార్థుల సహాయంకోసం అక్టోబరు 30వ తేదీన మద్రాసు, సౌందర్య మహల్ లో ప్రదర్శించారు. ఈ ప్రదర్శనకు నటగాయకుడు శ్రీ సూరిబాబు అధ్యక్షత వహించారు. శ్రీ అనుముల శేషగిరి దర్శకత్వం వహించారు.

కులతత్వానికి సంకెళ్లు వేయబోయి, నుగుణవతియైన అర్ధాంగిని కోల్పోయిన అభాగ్యుని జీవితగాథ ఈ నాటకం, తెలుగునాడులో అనేకచోట్ల ప్రదర్శింపబడి, ప్రశంసలందుకొన్నదే!

ఈ నాటకంలో పాల్గొన్న నటీ నటులందరూ అతి చక్కగా, పాత్రపోషణను అర్థం చేసుకుని నటించారు. ముఖ్యంగా – సుదర్శనంగా నటించిన యస్. సాంబశివరావు, విమలగా నటించిన కుమారి కె. లీల మెచ్చుకోదగ్గ స్థాయిని నటించారు.

చదరంగం:

# ఆటలో ఒక్కసారి పప్పులో కాలువేసినా ఓటమి తప్పదు!

ఆట పోవడానికి ఒక్క తప్పుఎత్తు చాలు! ప్రత్యర్థి ఒక్కటే ఒక్క ఎత్తు తప్పుగా వేసినా వెంటనే దానిని ఆధారం చేసుకొని ఆ ప్రయోజనం చేయిజారిపోకుండా చివరి కంటా జాగ్రత్త పడడమే గెలుపొందడానికి ముఖ్య సూత్రం.

పీసీ మెమోరియల్ సంఘం(అనంతపురం) క్రిందటి మే నెలలో నిర్వహించిన ఆంధ్ర చతురంగం టూర్నమెంటులో ఇద్దరు ప్రముఖులు—ఇప్పటి ఆంధ్ర ఛాంపియన్ శ్రీ జి. కుటుంబరావు, శ్రీ వి. జి. కృష్ణమూర్తి—ఆడిన ఆట పైన పేర్కొన్న సూత్రాన్ని రుజువు చేస్తున్నది. ఈ పోటీలో 23 వ ఎత్తు వరకు నలుపు ఆట ప్రశంసనీయంగా ఉన్నది. నలుపు 25 వ ఎత్తు ఆట పోవడానికి దారి తీసినది.

ఈ ఆట సాగిన క్రమం ఇది:

తెలుపు—జి. కుటుంబరావు; నలుపు—వి. జి. కృష్ణమూర్తి.

### బర్డ్స్ ఓపెనింగ్

1. బ—రా 4; బ—రా 3.
2. బ—రా శ 4; బ—మ 4.
3. బ—రా 5; బ—మశ 4.
4. గు—రా శ 3; గు—మశ 3.
5. శ—గు 5; శ—మ 2.
6. శ × గు (అ); శ × శ.
7. 0—0 (రాజువైపు కోట); గు—రా ఏ 3.
8. బ—మ 3; శ—రా 2.
9. గు—శ 3; 0—0 (రాజు వైపు కోట.)
10. బ—రా ఏ 3; బ—రా శ 4.
11. బ × బ (సి. పి.); శ × బ.
12. శ—మ 2 (ఆ); గు—శ 4.
13. మ—రా 1; మ—రా 2.
14. ఏ—గు 1 (?); మ ఏ—రా 1.
15. బ—రా గు 4; గు—మ 5
16. ఏ—మశ 1 (ఇ); గు × గు షా.
17. ఏ × గు; బ—రా ఏ 4 (!) (ఈ).
18. మ—రా 2; బ × బ.
19. బ × బ; శ—మ 5 షా.
20. రా—శ 1; మ—ఏ 5.
21. మ—గు 2; శ × గు.
22. బ × శ (ఉ); బ—మ 5.
23. మ—ఏ 3; మ—శ 3 (ఊ).
24. ఏ—శ 2; రా—శ 2 (?) (ఎ).
25. మ—ఏ 5 షా; రా—రా 2 (?) (ఏ).
26. మ × శ బ షా; రా—మ 2.
27. బ—గు 5!; మ—శ 4.
28. మ × మ బషా; రా—శ 1 (ఐ).
29. శ—రా 3; బ—రా 4.
30. బ × బ; మ—ఏ 6 షా.
31. రా—రా 1; మ—గు 6.
32. శ—శ 4 (ఒ); మ—ఏ 5.
33. రా—మ 2; ఏ × రా బ.
34. ఏ (1)—శ 1; ఏ (2)—శ 4.
35. మ—మ 6; ఏ (1)—శ 2.
36. మ—గు 8 షా; రా—మ 2.
37. మ—శ 7 షా; నలుపు ఓటమి అంగీకరించినది.

(అ) నలుపుబలం చెడడానికి దోహదమివ్వనప్పుడు శకటు ఇచ్చి గుర్రం తీసుకోవడం వాంఛనీయం కాదు. ఇంతకన్న 6. బ—మ శ 4 వేయవచ్చు.

(ఆ) వెంటనే 12. బ—రా గు 4 వేసి ఉండవలసినది.

(ఇ) తెలుపు 14 వ ఎత్తు నిరర్థకమని దీనితో రుజువు అయినది.

(ఈ) ఇక్కడ నలుపు 17—; బ—రా 4 కూడా ఆడవచ్చు. 18. బ × బ; శ × బ. 19. ఏ × ఏ షా; ఏ × ఏ. తెలుపు ఏనుగు స్థితి అయోమయంగా ఉన్న కారణం చేత ఆటలో నలుపుదే పై చేయి.

(ఉ) తెలుపు 22. శ × శ ఆడితే నల్ల బలానికి లాభం.

(ఊ) 23—; మ × మ. 24. ఏ × మ; బ × బ. 25. శ—రా 3; బ—రా గు 4. 26. శ × శ బ; ఏ × శ బ షా. 27. రా—రా 2; ఏ × రా గు బ అయితే నలుపు సులభంగా గెలుపొందుతుంది.

(ఎ) 24—; బ × బ ఆడి ఉండవలసినది.

(ఏ) ఇప్పటికి కూడా మించి పోయింది లేదు. నలుపు 25—; మ—గు 3 వేసి ఉండవలసినది. 26. మ × శ బ; మ × గు బ అయితే ఈ ఆటలో ఇంకా నలుపుదే పై చేయి.

(ఐ) ఇప్పుడు నలుపు ఆట అంతా తారుమారైనది. ఒకప్పుడు ఉధృతంగా ఉన్నా ఇప్పుడు నలుపు అధికమైన ఒత్తిడికి గురి అయినది.

(ఒ) 27 వ ఎత్తునుంచి ఆటలో తెలుపుదే పై చేయి.

(ఓ) ఇంక నల్ల బలానికి మార్గంలేదు.

—చాగంటి బాపిరాజు

### సమస్య




తెలుపు ఆడి రెండుఎత్తులలో ఆట కట్టాలి. సమాధానం 1960 నవంబరు 30 వ తేది సంచికలో

## గళ్ళనుడికట్టు-25

### ఆధారాల పోటీ ఫలితం

శ్రీమతి ఎస్. అరవిందాదేవి (కాకినాడ) పంపిన ఆధారాలు ఉత్తమమైనవిగా నిర్ణయించి ఆమెకు బహుమతిగా రు. 5 లు పంపుతున్నాము.

శ్రీమతి అరవిందాదేవి పంపిన ఆధారాలు ఇవి:

29 అడ్డం. "కలవం అన్నవారి తల కొట్టివేయండి." (మేము ఇచ్చినది—లేశం.) జవాబు—లవం.

14 నిలువు. "పెళ్ళిలో అల్లుని అలుక దీనిపై జరుగును." (మేము ఇచ్చినది—పాన్పు.) జవాబు—పాన్పు.

—సంపాదకుడు.

## న్యూఢిల్లీ లేఖ

(12 వ పేజీ తరువాయి)

లో ప్రధానమంత్రి చాలా సమర్థతతో వ్యవహరించారు. ఆయనను రష్యన్ లాబీలోకి ఈడ్వడానికి సర్వదా ప్రయత్నించే ఒకవర్గం విలేఖరులు ఎంత కవ్వించినా, ప్రధానమంత్రి తమ సంధాను విడువకపోవటమే కాక, సమితి కార్యదర్శులుగా ముగ్గురుండాలని రష్యనులు చేసిన సూచనలను సైతం తిరస్కరించారు.

రష్యా ప్రధానమంత్రిని గూర్చి ఒకానొక భారతీయ వార్తాపత్రిక చేసిన వ్యాఖ్యలను రష్యన్ విలేఖరి ఒకరు శ్రీ నెహ్రూ దృష్టికి తీసుకొని వచ్చారు. ఆయన చెప్పిన సమాధానం ఆ విలేఖరికి సంతోషం కలిగించి ఉండవలసింది. ప్రధానమంత్రిని అప్పుడు జాగ్రత్తగా గమనించిన వారికి ఆ సమాధానం ఆయన చెప్పదలిచే చెప్పారా, లేక మాటల గారడీ చేస్తున్నారా అని ఆశ్చర్యం కలుగక పోలేదు. కమ్యూనిస్టేతరుల విషయంలో, ముఖ్యంగా బ్రిటిష్ వారిపట్ల, అమెరికన్ల పట్ల రష్యా వారి దృక్పథం, వాడేభాష దూషణతో కూడి ఉంటున్నవి. కాని కమ్యూనిస్టుల ప్రవర్తనపై వ్యాఖ్యానించే హక్కు మాత్రం ఎవరికీ లేదని ఆ రష్యన్ విలేఖరిఅభిప్రాయం.

శ్రీ హుమయూన్ కబీర్ సాంస్కృతిక వ్యవహారాల మంత్రిగా పనిచేస్తున్నారు. ఆయన కృషి ఫలితంగా రష్యాతో మనకు సాంస్కృతిక ఒప్పందం ఉన్నది. అందువల్ల, న్యూయార్కులో రష్యా ప్రధానమంత్రి ప్రదర్శించినసంస్కృతిని అభివర్ణించేఅధికారం శ్రీ కబీర్ కే ఉన్నది! ★

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# గళ్ల నుడికట్టు-27

## ఆ ధా రా లు

### అడ్డము

1. కూడనిమాట అని చూడండి యుద్ధం తప్పదు.

*3. చతుర్విధోపాయాలలోను మంచిది.

5. రాముడే దేవుడా!

8. చంద్రుడి కోటి.

9. కూముక్క మరెక్కడా అనరాదండో రాదండో అంటూనే ఆడవాళ్ళంత పనీ చేసేస్తారు.

11. కొలిమిలో గాలిఊదేది.

12. ముదితలో వార్ధక్యం ప్రవేశించింది.

15. ఒక్క నమస్కారంఅంటే సరికాని, ముందర వికారం చూపెడితే మాత్రం బ్రతిమాలుకున్నట్టు కూడా.

17. రాయని భాస్కరుడు దీనికి యేత్వమైనా ఇస్తాడుగాని ఈ త్వంమాత్రం కాదనేవాడు.

18. గాలి బలంగా ఉండేమోగాని వాలు ఎదురు తిరిగింది.

19. సావారా,-వంత మైనది.

20. వాయిస్తేసరి కోతై గెంతువేసుంది.

21. రామరామ! ఆడవాళ్ళసంగతెక్కడ మాట్లాడాం. మీరేచెప్పండి.

23. వెనకా తలగడప ఉంటే చాలు తల పెట్టడానికి కావలసింది ఉన్నట్టే.

24. రొక్కీ కలపండి. తిన్నగా వెళ్ళేందుకు దారి కనిపిస్తుంది.

26. తలవగరానిది; తలవగా తలవగా పెరుగునది. విచారించి చూడండి.

28. దొంగతనంగా సంపాదిస్తే మధురతరంగా ఉంటుందంటారు.

29. నీళ్ళలో పుట్టింది.

31. రాజతీవిగల హంస కాబట్టి దీనికి పేరువచ్చిందా?

33. నీళ్ళమీదైతే ఏమవుతుందోగాని, ఇంగుమీదమాత్రం నిజం తేలుతుందంటారు.

34. సగం గాథ ముందు సగం తీసేశారుగాని లేకపోతే ఈనాటికి సగంగాథ అయేది.

35. పదుగురిటు మొగ్గినందువల్ల వాళ్ళ మాటయందు ఈ నమ్మకం ఉంచి పాటించక తప్పదు.

### నిలువు

1. ఈ మాటేవిటో మాకూ ఊహ కందకుండా ఉంది.

2. అనిలుడిలో శాసనం.

3. చేసినకొద్దీ సాగేపని.

4. ఆముదంకాదు. ఆ మాట కొస్తే ఏ ముదమూ కాదు.

5. రమ్మ రమ్మను నక్షరములు రెండు—ఒక్కముక్కలో రాద్రేడితం.

6. ముత్యపుచిప్పలు ఎదురు చూసేది.

7. అచ్చ తెలుగులో చెప్పకోవాలంటే-మృత్యువే.

10. ముందు డోలున్నా మోతకాదు. హాయిగా ఊగుతూ నిద్రపోవచ్చు నీటిలో.

13. 11 అడ్డంలోది వచ్చాక కులాసా ఉంటే ఉండొచ్చుగాని ఇదిమాత్రం ఉండదు.

14. అ తింటికోడళ్లు కత్తిమీద చేసేవి.

*16. చీకటి.

19. మూడక్షరాలా తలంటుకోడానికే.

20. లోగిట్లో రెండు వాకిళ్ల మధ్య నడిచేది!

22. అక్క అనుకున్నా మానినా కవులంతా కావ్యంమధ్య ఎక్కడో ఓ చోట రాసిపడేసే వృత్తం.

23. అలకీ వలకీ అవతలది.

25. ఇంటికా డెద్దులేవి?

27. రగడ సరికాదనేవాడే గడుసుమనిషి.

28. యముని సన్నిధినే ఋషి.

29. జీవితాంతం మీకు తోడుగాతిరిగే శాస్త్రీ.

30. —దేవర! తెలియనిదేముంది!

31. కంచికెళ్తే మన కెదురయే దిది కాదుగద?

32. సితిపరుడేపక్క సుతిపరులు చేసేది. ఇదోరకం జమీందారీ!

★

### ఆధారాల పోటీ

గళ్ళనుడికట్టు—27 లో 3 అడ్డం మాటకు, 16 నిలువు మాటకు మేము ఇచ్చిన ఆధారాల కన్న ఉత్తమమైనవి పంపేవారికి రు. 5 లు బహుమతి ఇస్తాము. ఆధారాలు మాకు చేరవలసిన ఆఖరి తేది నవంబరు 19, 1960.

— సంపాదకుడు.

### 26-వ గళ్లనుడికట్టుకు జవాబులు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 తా | 2 ప | ము | | 3 హా | 4 ష | ము | | 5 కై | 6 జా | రు |
| | ల్ల | | | | డా | | | | షు | |
| 7 కే | కి | | | 8 మా | న | ము | | | 9 వా | 10 సా |
| స | | 11 వా | ణి | | ను | | 12 చా | 13 ప | | మె |
| 14 ఠి | పు | లు | | 15 యు | డు | 16 బో | | 17 వ | ని | త |
| | | 18 గ | త | ము | | 19 యే | తు | లు | | |
| 20 ఆ | మె | ను | | 21 డు | 22 ఉ | త | | 23 రో | ఫ | 24 ము |
| ము | | 25 లు | గు | | త్ప | | 26 కై | లు | | డు |
| 27 ని | 28 శ | | | 29 వా | ల | కం | | | 30 వే | రు |
| | త | | | | మా | | | | ద | |
| 31 మా | కం | దం | | 32 నె | ల | లు | | 33 భో | ము | డు |

## 'అయామ్ సారీ!'

ఒకచోట సిటీబస్సులో ఎక్కిన స్త్రీ కూర్చోడానికి చోటులేక, ఇచ్చేవారు లేక ఒక యువకునికి సమీపంగా నిలబడింది. బస్సు పోతూ పోతూ ఒక్క కుదుపు కుదిపేసరికి ఆమెగారు ఆయన మీద పడింది. అంతలో ఆమె లేచి ఏదో అనబోయింది. ఆ యువకుడు చటుక్కున "అయామ్ సారీ!" అన్నాడు. ప్రయాణికులు అందరూ ఒక్కసారి ఘొల్లుమన్నారు. అతడు కూడా గ్రహించుకుని వారితో శ్రుతి కలిపాడు.

—కె. మోహన్‌రెడ్డి (నల్లగొండ)

* * *

## టిక్కెట్లు చింపే పిచ్చివాడు!

ఒకానొక ఆసామీ ఒక సినిమా థియేటర్‌కు వచ్చి మూడుసార్లు టిక్కెట్ కొన్నాడు. నాలుగోసారి మళ్ళీ బుకింగ్ ఆఫీసుకు వెళ్ళేసరికి—

"ఏమిటి, ఇన్నిసార్లు టిక్కెట్ కొంటున్నారు" అని గుమాస్తా అడిగాడు.

"ఇక్కడ టిక్కెట్ కొంటే ఏమిలాభం? డబ్బంతా దండగ అయిపోతోంది. సినిమా చూడడానికే లేకుండా పోతోంది. పైన ఎవడో పిచ్చివాడు ప్రతిసారీ టిక్కెట్ సగానికి చింపేస్తున్నాడు!" అన్నాడు, ఆ ఆసామీ.

—సి. వి. కె. మూర్తి (బిట్రగుంట)



—చిత్రకారుడు: బి. రామస్వామి (కరీంనగరము)

# హాస్య కథలు

## 'ఛీ, నీ దుంపతెగ!'

మా ఊళ్ళో నాటకప్రదర్శనం జరుగుతోంది. భీముడుపాత్రధారి మహాగంభీరమైన పోజుపెట్టి, ఒక చేత్తో గదపట్టుకొని, రెండవ చేత్తో మహాభయంకరంగా మీసం దువ్వుతూ ధర్మరాజు పాత్రధారిని సంబోధించి "అన్నా ధర్మరాజా..." అని ఏదో చెప్పబోయాడు. అంతలో ఒక దోమ అతని మీసంమీద వాలింది. భీముడు పాత్రధారి మహాకోపంగా ఒక్క దెబ్బవేసి ఆ దోమను హతమార్చి "ఛీ నీదుంపతెగ!" అని అరిచాడు. ప్రేక్షకులు అందరూ ఘొల్లుమన్నారు.

—పి. భాస్కరరావు (బందరు)

* * *

## "ఇప్పుడు లేదు!"

పాలమనిషి - ఏమండీ పైకం ఈవేళ అయినా ఇస్తారా?

ఆయన - ఇప్పుడు లేదన్నానుగా, అమ్మా.

పా. మ. - లేదు. ఎప్పుడూ ఇదే మాట. మాట అంటే రోషమన్నా ఉండాలి.

ఆయన - ఇప్పుడు లేదన్నానుగా, అమ్మా.

పా. మ. - ఎన్నిసార్లు మీ ఇంటిచుట్టూ తిరగాలి? కొంచెం లజ్జ ఉండక్కర్లే?

ఆయన - ఇప్పుడు లేదన్నానుగా, అమ్మా.

**Printed and Published for NageswaraRao Estates (Private) Ltd,. by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad**

Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.




# బాగ్దాద్ గజదొంగ

డైరెక్షన్: T.P. సుందరం

STUDIO

CHITRALEKHA

ఆంధ్ర..గౌతమి పిక్చర్స్ + సీడెడ్..భాస్కర్ పిక్చర్స్ + నైజాం...వాణీ ఫిలింస్